# శ్రీ గౌరీ వివాహము

పదకావ్యము

ఇది

శ్రీ రాజా మృత్యుంజయ నిశ్శంకబహాదరు
సంగంవలస జమీన్దారుగారివలన
విరచింపబడి

శ్రీమన్మహామహోపాధ్యాయ శ్రీమత్ప
రవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలు
గారిచే పరిశీలనామోదములనొంది

వైశాఖపట్టణమునందలి
ఆర్ష ముద్రాశాలయందు ముద్రింపబడి
ప్రకటింపబడియె
శాలివాహనశకాబ్దంబులు ౧౮౧౭
A. D. 1895 సం॥ ఫిబ్రవరి 19ది
శ్రీజయనామసం॥ మాఘ బ౧౦ మంగళవారము

1895
Arsha Press Vizagapatam
Publisher S. P. S. Jagannathaswamy
Ayyavaralugaru
Printer D. Guranna.



శ్రీరామ.

శ్రీరస్తు.

శ్రీశుభం భవతు.

అవిఘ్నమస్తు.

శ్రీసాయిగురవేనమః

# శ్రీగౌరీవివాహః

## ప్రథమాశ్వాసప్రారమ్భః॥



శ్రీశివా శితికంఠ శ్రీపార్వతీశ్వరా।
శ్రీశుభంబులనొసగి శీఘ్రమున బ్రోవు॥
విఘ్నములు రాకుండ విఘ్నరాజును దలఁచి।
భారతికి భక్తితో ప్రణతులొనరింతు॥ శ్రీశివా॥ ౧॥
విష్ణుముఖ దేవులకు వినయనతులొనరించి।
వేంకటరంగగురు వినుతింతు మదిని॥ శ్రీశివా॥ ౨॥
సంగమవలసేశ సకలలోకాధీశ।
విశ్వేశ్వరస్వామి విఖ్యాతనామా॥ శ్రీశివా॥ 3॥
ఇలనెందువంశమున నెలమితో బేరొందన్న।
నియతమృత్యుంజయ నిశ్శంకనృపతి॥ శ్రీశివా॥ ౪॥
నీకంకితంబుగా నే నేర్చురీతి చే।

గౌరీవివాహంబు కథనుగా జేతు॥ శ్రీశివా॥ ౫ ॥
మును భారతమునందు మునులు చెప్పినరీతి ।
పరిణయవివరణ బరికించి చెపుదు॥ శ్రీశివా॥ ౬॥
ఉత్తరదిశయందు నుత్కృష్టమై వెలయు ।
హిమవంతమను పేరజమరు నగమొకటి॥ శ్రీశివా॥ ౭॥
దేవతాస్థానమై తేజరిల్లుచునుండు ।
పుష్పఫలారామపూర్ణమై యొప్పు॥ శ్రీశివా॥ ౮॥
స్థలజలజంబుల సంలితంబై యొప్పు ।
సర్వఫలవృక్షముల సరణి జెన్నొందు॥ శ్రీశివా॥ ౯॥
కస్తూరిజవ్వాది ఘనమైన వాసనలు ।
గుప్పుమ్మరిల్లుచునుండు నెమ్మిమీరగను॥ శ్రీశివా॥ ౧౦॥
అఖిలజనంబులు నతివేడ్కగొనియాడు ।
నతనికిమేనక యనుపత్నిగలదు॥ శ్రీశివా॥ ౧౧॥
ఆమె ప్రాగ్జన్మమున సమరిన ఫలము చే ।
దాహ్యాదచిహ్నముల్ దగదాల్చియుండె॥ శ్రీ॥ ౧౨॥
మెలతలానందింప మేనకాదేవికిని ।
పుత్రికారత్నంబు పుట్టి వర్ధిల్లె ॥ శ్రీశివా॥ ౧౩॥
అంతట హిమవంతు డానందమగ్నుడై ।
భూరిసంభావనల్ భూసురులకిచ్చె । శ్రీశివా॥ ౧౪॥
నామకరణము సేయ నగరాజు యోచించి ।

బంధుజనులను జూచి పలికె మోదమున ||శ్రీశి||౧౫||
పేరుబెట్టగవలయు పెద్దలందఱుగూడి|
యనుచు బ్రార్థనజేయ నాబంధుజనులు||శ్రీ||౧౬||
పర్వతపుత్రినై పరగగావున నీమె|
పార్వతియనిపేరు పరగునంచనిరి ||శ్రీశివా||౧౭||
తమపరిణయమని తల్లిదండ్రులచేత|
తగనొందెనామంబు తరుణీలలామ ||శ్రీశి||౧౮||
అగజసోదరుడైన యామైనాకుండు|
నబ్ధితో సఖ్యంబు నమరంగజేసె ||శ్రీశివా||౧౯||
తల్లిదండ్రులకును దనివిరెట్టింపంగ|
తగువిద్యములుసేసె తరుణినవ్వుచును ||శ్రీ|౨౦||
జిలిబిలిమాటలును జెలువొందవాడుచును|
ముదితలతోడాను మాటలాడుచును ||శ్రీశి|౨౧||
మువ్వలమురిడీలు మ్రోయంగనంఘ్రుల|
మురిపెంపునడలచే ముద్దుగుల్కుచును|శ్రీశి||౨౨||
చిఱుతప్రాయంబునకు జెలువౌనలంకృతుల్|
చివ్వారిధరియించి చెలులతో నాడె ||శ్రీశి||౨౩||
నీటుగాబాల్యంబు నివ్వటిల్లగనంత|
యతివకును యౌవనం బమరివెలకెక్కె||శ్రీ||౨౪||
మెరుపుతీగనజాలె మెలతమెయికాంతిచే|

చంద్రునిగేరెను చా౯నెమోము ॥శ్రీశివా॥ ౨౫॥
కలువరేకులబోలె కలికికన్నులతీరు।
శ్రీకారములబోలె చెలియకర్ణములు ॥శ్రీశి॥ ౨౬॥
సంపెంగమొగ్గకు సాటియానన వచ్చు।
కాంతిచే జెలువొందె కాంతనాసికయు॥శ్రీ॥ ౨౭॥
గళముశంఖమురీతి కమనీయమై యొప్పె।
పూలదండలనెన్నె పొలతిబాహువులు ॥శ్రీ॥ ౨౮॥
పొలతికిచనుదోయి పొడజూపె పొలుపుగా।
పొక్కిలి సురపొన్నపూబోలియలరె ॥శ్రీశి॥ ౨౯॥
గరితకు మధ్యంబుగగనమైయొప్పెను।
ఇసుకదిన్నెలబోలెనింతిజఘనములు॥శ్రీశివా॥ ౩౦॥
అరటిబోదెలబోలె నతివపెందొడలెన్న।
వరిపొట్టలనుమీరె వనితజంఘికలు ॥శ్రీశి ॥౩౧॥
కమఠంబులనుబోలె కలికిప్రపదంబులు।
పదములుపద్మసంపదలజెన్నొందె॥శ్రీశివా॥ ౩౨॥
నక్షత్రకాంతిచే నఖములుభాసిల్లె।
నెలకళలఖంగిని నెలతవర్ధిల్లె ॥శ్రీశివా॥ ౩౩॥
ఈరీతిశ్రీగౌరి హిమవంతుదరినుండ।
నతితోడయుక్తుడై నగరాజునలరె॥శ్రీశివా॥ ౩౪॥
వీణాపాణినిబూని విష్ణుసంకీర్తనలు।

నానెముఁగ జేయుచును నారదుఁడు వచ్చె॥ శ్రీశి॥ ౩౫॥
వచ్చినమాఁగని పరభక్తియుక్తుఁడై।
పూజానమస్కృతుల్ ప్రాంచగాఁ జేసె॥ శ్రీశి॥ ౩౬॥
ఘనితసంతుష్టుఁడై యామాఁపర్యుఁడు।
ఆశీఃపరంపర లలరంగ జేసె॥ శ్రీశివా॥ ౩౭॥
ఈగిరిజాదేవి నీపదుఁ బెండాడి।
తనయర్ధదేహంబు తప్పకను జేయు॥ శ్రీశివా॥ ౩౮॥
అనినారదుఁడుపలికి యరిగెనహృష్యుడై।
యదివిని హిమవంతుఁడానంద మొందె। శ్రీశి॥ ౩౯॥
ఆగౌరిదేవియును నతిసంతసమునొంది।
చెలికత్తెలనుజూచి చెలిమినిట్లనియె॥ శ్రీశివా॥ ౪౦॥
శశిధరుండెక్కడ సకియనేనెక్కడ।
ననుజెందుటెక్కడ నాఁకిరో వినవె। శ్రీశివా॥ ౪౧॥
అనివిరహార్తయై యాపార్వతీదేవి।
శివునిచిత్తమునందుస్థిరముగానిలిపె॥ శ్రీశివా॥ ౪౨॥
అంతట శ్రీశంభుఁడాదక్షపుత్రిక।
నెడబాసినది మొదలేమితోచకను॥ శ్రీశివా॥ ౪౩॥
ఉండిదాక్షాయణియుర్వీధరేంద్రునకు।
తగపుత్రియైయుంటతానెఱుంగుచును॥ శ్రీశివా॥ ౪౪॥
ఆగిరితటమునసమరు నువవనమందు।

దపము సేయుంబూ నెదగ శంకరుండు॥ శ్రీశివా॥ ౪౫॥
అదిగని హిమవంతు డాత్మ జాతను జూచి।
యధికమోదముతో దనపుడిట్లు లనియె॥ శ్రీశి॥ ౪౬॥
నాచిన్ని నెలతూన నాముద్దు రత్నమా।
నీ కేళివనములో నీలకంఠుండు॥ శ్రీశివా॥ ౪౭॥
తపము సేయగబూని తగనిచ్ఛగావున।
తనిపరిచర్య లటివరో నీవు॥ శ్రీశివా॥ ౪౮॥
సేయగావలయును శీతాంశుధరు సేవ।
సకలశుభంబులు చాలనీకొసగు॥ శ్రీశివా॥ ౪౯॥
మునులసేవలు సేయు ముదితలునీసాటి।
వారలెగారెయన వనితయొప్పెంగి॥ శ్రీ శివా॥ ౫౦॥
తనమదికోరెకలు తగదీర్చువాడని।
హర్షంబుతో డుత నాయుమాదేవి॥ శ్రీశివా॥ ౫౧॥
బాలచంద్రునిబోలు ఫాలప్రదేశమున।
కస్తూరితిలకంబుకరముమాగాదిద్ది॥ శ్రీశివా॥ ౫౨॥
కన్నులకాటిక కమనీయముగనుంచి।
మేల్కాటిరవికను మేలుగాదొడగి॥ శ్రీశివా॥ ౫౩॥
జిలుగుబుటేదార్ చీరెపాలయలుగగట్టి।
ఆభరణభూషితమై చెలువుమీర॥ శ్రీశివా॥ ౫౪॥
వచ్చిశంకరుగాంచి హెచ్చుమోహముచేత।

ఆనందభరితమైయాగౌరి దేవి॥శ్రీశివా॥౫౫॥
నెచ్చెలి చాటున నీటుగానిలచుండి।
కరయుగంబులుమోడ్చిహరుని సేవించి ॥శ్రీశి॥౫౬॥
నీలకంఠునిదరిని నిల్చు నెలతనుజూచి।
ఆశ్చర్యమునుబొందియాభృంగియనియె॥శ్రీశి॥౫౭॥
స్వామి దేవకవార్గ సాన్నిధ్యమునఁ గ।
లావణ్యవతి వచ్చె లలితముగనిల్చె ॥శ్రీశివా॥౫౮॥
తపమువిఘ్నము సేయదలచినట్లున్నది।
వామదేవమహాశవనము వెడలింతు॥శ్రీశివా॥౫౯॥
అనవిని భృంగికి నామహేశుండనియె।
పరిచర్యసేయను పణతిదావచ్చె॥శ్రీశివా॥౬౦॥
అనవిని యాభృంగి యతివినయంబుతో।
బరమేశ్వరునిజూచి పలికెనిట్లనుచు ॥శ్రీశివా॥౬౧॥
వెరచి నేజెప్పెద వినుము మహాదేవ।
కమలాక్షితోగలసి కరుణదప్పెదరో ॥శ్రీశి॥౬౨॥
అనివిన్నవించిన యాభృంగినటుజూచి।
చిరునవ్వుమోముతో శివుడప్పుడనియె ॥శ్రీశి॥౬౩॥
అంతపనేలను నతివపరిచర్యలను।
చేయనిమ్మనుచును సెలవిచ్చెనంత ॥శ్రీశివా॥౬౪॥
అనుపమవేషమై యాపార్వతీదేవి।

పరిచర్యనెపముచే దరిజేరియుండె॥శ్రీశివా॥౬౫॥
అతిమనోహరమైన యతివసౌందర్యంబు,
సరసిచూచుచుహాయుండతి మోహ మొందె॥శ్రీ॥౬౬॥
హృత్వాంతరము లుండు తెరిగి శ్రీశంకరుడు।
సాత్త్వికభావమును సడలంగజేసె॥శ్రీశివా॥౬౭॥
ఆసమయంబునసమరు లింద్రునితోడి।
యజునితోనసరి వారతిసంభ్రమమున॥శ్రీశివా॥౬౮॥
లోకేశయీరేడు లోకములు బాధించు।
తారకాసురుద్రుంచి తగరక్షసేయు॥శ్రీశి॥౬౯॥
అనివిన్నవించిన నాబ్రహ్మదేవుండు।
పలికెనిట్లనుచును భావించిమదిని॥శ్రీశివా॥౭౦॥
పార్వతీశ్వరులకు బరగపుత్రుడుబుట్టి।
తారకాసురునణచు తథ్యంబుగాను॥శ్రీశి॥౭౧॥
కావున వారల గలయునటో నరించ।
శాంతులేడేరును ఘనులారవినుడి॥శ్రీశివా॥౭౨॥
అవిననింద్రాదులు నతివేడుకలనొంది।
మన్మథురాకను మదిగోరిరపుడు॥శ్రీశివా॥౭౩॥
మదనుడింద్రునియాజ్ఞ మన్నించి వేగమున।
రాచిలుకబూదిన రథమధిష్ఠించి॥శ్రీశివా॥౭౪॥
రతిరతీదేవియును సరసనుకూర్చుండ।

సరసోక్తులాడుచు సవిలాసుడగుచు॥ శ్రీశివా॥ ౨౫॥
వచ్చియుండ్రిఁగాంచి వరనసాదరములు।
గావించిరతిశచి గడనుంచెనంత॥ శ్రీశివా॥ ౨౬॥

అమరేంద్రుఁడతిమోద మందియా మునకు।
నర్ఘ్యాసనంబిచ్చి యతని శుభమడిగి॥ శ్రీశి॥ ౨౭॥
మానోక్తులాడిన మదనుఁడిందు నిజూచి।
యతివినయంబుతో నప్పుడిట్లనియె॥ శ్రీ॥ ౨౮॥

నీకరుణఁగలిగిన నిజము రుద్రుండయ్యెనా।
యలిగిన నాకేమియు శుభయంబునను॥ శ్రీశివా॥ ౨౯॥

వినుము నా విన్నపము శివదీక్షరి చెవ।
తాకరాసురుడను దైత్యుండుగలడు॥ శ్రీశివా॥ ౩౦॥
వానినివధియింప వశముగాదెవ్వరికి।
శివునికొమరుండైన సేనానిదక్క॥ శ్రీశివా॥ ౩౧॥
కావునను మత్తోడఁ గలియంగ హరుఁ గూర్ప।
నిన్ను గోరితిమిది నిశ్చయంబుల గ॥ శ్రీశివా॥ ౩౨॥
ఇట్లు గావించిన నీవుపరిణయఫలము।
శిష్టరక్షణ నీకు సిద్ధముగఁగలుగు॥ శ్రీశివా॥ ౩౩॥
అనినవిని కందర్పుడతిమదయుక్తుడై।
పాకశాసనునితో బలికె మోదమున॥ శ్రీశివా॥ ౩౪॥

అలవసంతుని సహాయము గొనియే గద।
శివయు శివుడును గల్గు సిద్ధవనమునకు॥ శ్రీశివా॥ ౨౪॥
పరివారు భయముల నేకముగ జేసెదను।
నావిరిశరమున నాత్రాణగనుము॥ శ్రీశివా॥ ౨౫॥
అని మీసమెగవేసి యాయింద్రునకు మ్రొక్కి।
చనియె సౌధంబునకు సతితో గూడి॥ శ్రీశివా॥ ౨౬॥
శయ్యపై శయనించు సహాయంబున నమరతి।
చెక్కిట చెయిజేర్చి చింతించిపలికె॥ శ్రీశివా॥ ౨౭॥
ప్రాణేశ నామనవి బాగుగావినవయ్య।
బలవద్విరోధంబు బాగుగా దెపుడు॥ శ్రీశివా॥ ౨౮॥
హరుని తపోవిఘ్నమయిన మేలింక నీకు।
మనకేమి కీడైన మాన్పలేడతడు॥ శ్రీశివా॥ ౨౯॥
సామాన్యదేహుడు సకలదేహార్చితుడు।
హరియంతవాడతడరసి చూడగను॥ శ్రీశివా॥ ౩౦॥
మనకేమి సేమమని మానిని మ్రొక్కగను।
పుష్పబాణుండపుడు ప్రాణేశికనియె॥ శ్రీశివా॥ ౩౨
భామినీ యీవట్టి భ్రమమానుమేమమున।
గానిమ్ము దేవతల కార్యమును మాన॥ శ్రీశివా॥ ౩౩॥
అనిన నారతిదేవి మనమున నమకొనె।

కాగలకార్యములు గాకపోవనుచు॥ శ్రీశివా॥౯౮॥
పతిమాటకెదురాడ బనియేమిలేదని।
పతిచెంతదానపుడుపవళించి యుండె॥౯౪॥

శ్రీశివాశితికంఠ శ్రీపార్వతీశ్వరా॥
శ్రీశుభంబులనొసగి శీఘ్రమునబ్రోవు॥





శ్రీరామా-

శ్రీరస్తు.

శ్రీశుభం భవతు-

అవిఘ్నమస్తు-

శ్రీసాంబశివాయనమః-

# శ్రీ గౌరీవివాహః

## ద్వితీయాశ్వాసప్రారమ్భః.

శ్రీశివాశితికంఠ శ్రీపార్వతీశ్వరా।
శ్రీశుభంబులనొసగి శీఘ్రమున బ్రోవు॥

అంతప్రభాతమునందు మేలుకొని మరుడు।
పయనమై వెడలెదన పత్నితో కూడ॥ శ్రీశివా॥ ౧॥
ఒంటిబాపదువలె నొప్పుచునుదయించి।
వేగుచుక్కప్పుడు విధివశముగాను॥ శ్రీశివా॥ ౨॥
దీనతగలరతి దేవియాననమున।
చంద్రబింబముతోంటిచాయ సొకలరె॥ శ్రీశివా॥ ౩॥
అరుణోదయంబున నలరువిల్తుడు జనె।
హరునాశ్రమంబున కతివేగమునను॥ శ్రీశివా॥ ౪॥
అంతవసంతుడు నలరువిల్తుకూడి।

ఆవనమునందు విహారములుసలిపె॥ శ్రీశివా॥ ౫॥
ఆసమయమునందు నలరులుఃకసించె।
శుకపికధ్వనులచే శోభజెన్నొందె॥ శ్రీశివా॥ ౬॥
మలయమారుతములు మందముగావీచె।
మధుకరములరొదల్ మానుగాహెచ్చె॥ శ్రీశి॥ ౭॥
అప్పుడప్పార్వతి యనుగుచెలులైయున్న।
కలవాణి నవమాలి కలత్రోడగూడి॥ శ్రీశివా॥ ౮॥
వనకేళిజేయుచు దనచెలులనుజూచి।
హరుసేవ కాలస్య మాయెగాయనిన॥ శ్రీశివా॥ ౯॥
కలవాణినవమాలికలు చిరునవ్వుతో।
ననిరిగౌరినిజూచి యతివేడ్కలలర॥ శ్రీశివా॥ ౧౦॥
అతిసుందరుండైన యాయీశుదయజెంది।
మెలగినమేలగు నెలతరో వినవే॥ శ్రీశివా॥ ౧౧॥
మావంటిచెలులతో మరియేమిపనిలేదు।
ఈశునిచెంగట నెలమితో మెలగు॥ శ్రీశివా॥ ౧౨॥
మేమునన్నదిమంచి మేలనియుంటిమి।
నీమదికోరికల్ నిజముగాదెలసి॥ శ్రీశివా॥ ౧౩॥
అనిమేలమాడిన యాచెలులనుజూచి।
చిడుమడిపాటునచెలియదానవియె॥ శ్రీశివా॥ ౧౪॥
నేనెవ్వరికిపనుల్ నేర్పునజేయంగ।

జాలనుజనియెద జననిసన్నిధికి। శ్రీశివా॥౧౫॥
అనిపైటజేరాడ నతివేగజను చెలి।
చేయిబట్టినిలిపియా చెలియచాననియె॥శ్రీ॥౧౬॥
కలవాణిమాటల గలిగెజనమందదా।
హాస్యంపుమాటలకాగ్రహముదగునా॥శ్రీశి॥౧౭॥
శంకరుపరిచర్య పొంకముగజేయుమని।
నీతండ్రినిను వేడ్క నియమించియుండె॥శ్రీశి॥౧౮॥
కావునగురునాజ్ఞ కనుమీరియుండుట।
తగదునీకెప్పుడు తరుణివినవమ్మ॥శ్రీశివా॥౧౯॥
అనుచుమబోధించి యంబికాదేవిని।
శశిధరుసేవకు సమకూర్చిరంత॥శ్రీశివా॥౨౦॥
పార్వతిశంభుని పజ్జ'కుజ'నుదెంచి।
జడవిప్పయత్నించి జంకెగంగకును॥శ్రీశివా॥౨౧॥
మేనబూసినభూతి మేలుగామడువబో।
భోగిభూత్కృకులకుభూరిభయమొందె॥శ్రీ॥౨౨॥
గళనైల్యమునుదుడువ గాబోయిభీతిల్లె।
పుఱ్ఱెలపేరులను బొందుగాజూచి॥శ్రీశివా॥౨౩॥
వలువకాగప్పను వనితయాలోచించి।
పులిచర్మమునుజూచిబలుభీతినొందె॥శ్రీశివా॥౨౪॥
పరితినైనమహేశునిమెయినంట।

నలువిగాకపుడుండె నలినాయతాక్షి॥శ్రీశివా॥౨౫॥
అయినచో నెటులుండు హరుడతివిశ్వ చే।
దపము సేయుచును దానుపవనమునందు॥శ్రీశి॥౨౬॥
ఈశుసిజపమాల నింతిదాధరియించి।
తనతారహారమును దనరనందిచ్చె॥శ్రీశివా॥౨౭॥
ఇదితరియనియెంచి మదనుండునీశుపై।
వడినేసెసుమబాణవర్గమింపొంద॥శ్రీశివా॥౨౮॥
చలితమనస్కుడై శంభుండుయోచించి।
యలరువిల్తునదహించెనగ్నినేత్రమున॥శ్రీశివా॥౨౯॥
ఆసమయమునందు నావసంతుడుబారె।
ఆశలెల్లను జెదిరె నాపక్షిచయము॥శ్రీశివా॥౩౦॥
అంతటహిమవంతు డతిభీతియుక్తుడై।
తనపుత్రిపార్వతిని దగదోడితెచ్చె॥శ్రీశివా॥౩౧॥
కడువేడుకను మేన కాదేవియొద్దను।
నునిదియప్పుడు ధైర్యమున నుండిరంత॥శ్రీశి॥౩౨॥
ఆరతిదేవియువాతఱస్వరముతోడ।
నవనిపైబొరలుచు నతిదుఃఖపడుచు॥శ్రీశివా॥౩౩॥
శంకరుని శాంకరిని పొంకపర్చదలంచె।
శివునికేమపకృతి సిద్ధముగజేసె॥శ్రీశివా॥౩౪॥
పరమేష్ఠియాజ్ఞచే బరగనింద్రాదులు।

మచ్చరమెక్కించిమరుకాల్చిమరునీ॥ శ్రీశివా॥ ౩౫॥
హారుకంటిమంటకునప్పగించిరిగాని।
కావంగశక్తిలేరైరి ఘనములుమమ్మిపుడు॥ శ్రీశివా॥ ౩౬॥
అమరేంద్రుడెక్కడ నావసంతుండేడి।
అహహామమ్మునజూడనైనరారైరి॥ శ్రీశివా॥ ౩౭॥
నేను పాతివ్రత్య నియతిచేసుగ్రముగ।
మూడులోకములు నిర్మూలముగజేతు॥ శ్రీశి॥ ౩౮॥
అనియప్పుడాసాధ్వి మనమునజింతించె।
పరులనుహింసించపరహానియనుచు॥ శ్రీశివా॥ ౩౯॥
పతితోసహగమనంబు బాగుగాజేసిన।
కైవల్యపదవిని గాంచెదననుచు॥ శ్రీశివా॥ ౪౦॥
అగ్నిప్రవేశంబు నమరజేయగబూని।
అనలంబుదరిచేరి యారతీదేవి॥ శ్రీశివా॥ ౪౧॥
సకలలోకాధీశ సర్వేశ్వరాయని।
నాదేవునాజ్ఞచే నశరీరవాణి॥ శ్రీశివా॥ ౪౨॥
వనితరోనీకును వైధవ్యమిలలేదు।
అంగసంభూతుడనంగుడైవెలయు॥ శ్రీశివా॥ ౪౩॥
తానంగయుక్తుడై దగనీకునెప్పుడు।
గానవచ్చునుసుమ్ము కడుసుందరముగ॥ శ్రీశివా॥ ౪౪॥
మాంగళ్యలోపంబు మరినీకునెప్పుడు।

గాదుసుక్షేమంబును రహిమీరఁబలికె ॥శ్రీశివా॥౪౫॥
అంతరతిదేవియు నతిముద మొందుచు।
తనకాంతుతోఁగూడితగసుఖంబుండె॥శ్రీశివా॥౪౬॥
అప్పుడప్పార్వతియాత్మమనోరథ।
వికలత్వమునకయి వెతజెందిమఱి ॥శ్రీశివా॥౪౭॥
తనుజేందుధరు డేలయరుదెంచి నాకేళి।
వనమునతపమును నొనరంగజేసె ॥శ్రీశివా॥౪౮॥
పరిచర్యకై నేను పరమేశుదరిజేరి।
పతియతడేయనుచు భావించనేల ॥శ్రీశివా॥౪౯॥
అంతటమదనుండు నలరు బాణముచేయ।
వేలయాతనినణచె నీలకంఠుండు ॥శ్రీశివా॥౫౦॥
ప్రియునకునీరీతి ప్రేమలేకుండిన।
నారూపమదియేల నాదువయసేల ॥శ్రీశివా॥౫౧॥
అనిబహువిధంబులచే నశాంతయుండగా।
హరుడు కైలాసగిరి కరిగె వేగమున ॥శ్రీశివా॥౫౨॥
అరిగియేకాంతమున నతివిరహార్తుడై।
శయ్యపైవసియించె సతిదలంపుచును॥శ్రీశివా॥౫౩॥
పరిపరివిధముల భావించిఖిన్నుడై।
హరుడుండనా భృంగియరుదెంచెనిట్లనుచు॥శ్రీశి॥౫౪॥
దేవరమీమనిమీకుబోధింపనయ్యంత।

కనుపీకారంబుగా కాన్పించెనపుడు॥ శ్రీశివా॥౪౫॥
ఎన్నఁడు లేదిట్లు చిన్నబోవుటయేమి।
దాచక సెలవిమ్ము దయతోను సామి॥ శ్రీశివా॥౪౬॥
అనభృంగిగని హరుం డనియెను తత్క్షణంతో।
కామిని నేడబాసి కంటివికలతను॥ శ్రీశివా॥౪౭॥
కనులఁగట్టిన యట్లు కాంత దోఁచుచునుండు।
గావున నే నెటుల గందు పార్వతిని॥ శ్రీశివా॥౪౮॥
ఆనవిని యాభృంగి హాసంబుతోఁ బలికె।
కాంతగాదది మహాకాళిగను దోఁచె॥ శ్రీశివా॥౪౯॥
గాకున్న నచటను గరిమతో నుండక।
నీటకేళి పాడకట్లు చింత వేగమున॥ శ్రీశివా॥౫౦॥
సామి మిమ్ము నబట్టి సగము సేయక పోదు।
చిన్నెలును వన్నెలును చింతించి చూడ॥ శ్రీశి॥౫౧॥
ఏమట కానియా యింతి నెల్లయినను।
చూడక తాళనని శూలిముట్టఁగెను॥ శ్రీశివా॥౫౨॥
ఎరుకుల వేషమున వేగి నెలతను జూచి।
వచ్చెదననివలికె వామదేవుండు॥ శ్రీశివా॥౫౩॥
అనవిని భృంగియో యయ్యా సేవకురాలు।
వలె నేను మీ వెంట వచ్చెదను సామి॥ శ్రీశివా॥౫౪॥
అనుచు బల్కనభృంగి వామహాసుడు చూచి।

యనిమోదానప్పుడుహర్షమలరంగ॥ శ్రీ శివా॥ ౬౪॥
నీ వెఱ్ఱి మొఱ్ఱులను నీచేష్టలనుమాని।
చక్కగానుండుమని ముక్కంటియనిన॥ శ్రీ శి॥ ౬౬॥
వినవయ్యమనబ్రతుకె వెఱ్ఱిమొఱ్ఱిగనుండ।
మఱిమంచిచేష్టలు మనకేలగలుగు॥ శ్రీ శివా॥ ౬౭॥
అనుకొనియాయిన్దరతి వేడుకలుమీర।
నెమకలవేషమున నేగిరాగిరిశ॥ శ్రీ శివా॥ ౬౮॥
హాసుడపుడుతనచిహ్నమునుపడనీకుండ।
కరములందునుపూల గాజులనుదొడిగి॥ శ్రీశి॥ ౬౯॥
గిలుకుమట్టెలువ్రేళ్ల చెలువందధరియించి।
కుచ్చులబాపలీల్ గుమ్మటీల్ మరియు॥ శ్రీ శివా॥ ౭౦॥
పచ్చలబొగడలు బవిరలుమొదలగు।
కర్ణభూషణములు కర్ణములమెరయ॥ శ్రీ॥ ౭౧॥
ముకురనబలుకెంపు ముంగరభాసిల్ల।
పెకురతనపుపూసపేర్లుజెన్నొంద॥ శ్రీ శివా॥ ౭౨॥
శిరమునవరత్న శృంగారమైనట్టి।
బుట్టనొక్కటియూనిపొలుపుమీరగను॥ శ్రీ శివా॥ ౭౩॥
పూర్వమువిష్ణుండు భువనమోహినియైన।
కరణినిదావచ్చె గరకంఠుడటకు॥ శ్రీ శివా॥ ౭౪॥
అతనివెంటనే యారూఢం చెభృంగియును।

తోటిమెరుకలసాని సాటియై వెలసి॥శ్రీశివా॥౨౫॥
బత్తితో మెరుకుచు పరమేశు వెంటను।
తాటిబుట్టనుతన తలపైదబెట్టి॥శ్రీశివా॥౨౬॥
గాజుపూసలపేర్లు కంఠమునధరియించ।
ముక్కెరబొట్టదిముక్కునను వెలుగ॥శ్రీశివా॥౨౭॥
ఇత్తడికమ్మల నిరువొందచెవులందు।
హత్తించిసవతిని అపుడుతిట్టుచును॥శ్రీశివా॥౨౮॥
కొత్తయల్లిక గిలకగుత్తులు మోగియుండి।
వాయించికొంచునువచ్చెశివు వెంట॥శ్రీశివా॥౨౯॥
శివునియోగంబున శీఘ్రంబుగాభృంగి।
పార్వతియింటికి బరగంగజనియె॥ శ్రీశివా॥ ౩౦॥
చనియెరికెతవలె బనిబూనిబిచ్చంబు।
నడుగుచునెరుకనుకడుజెప్పదొడగె॥ శ్రీశివా॥౩౧॥
అవ్వావోయవ్వమా యవ్వమారాజవె।
యవ్వభాగ్యముగలిగియలరారునీవు॥శ్రీశివా॥౩౨॥
పాడిపంటలుగలిగి ప్రబలుదువెయవ్వ।
సిరిగలతల్లివై సిద్ధముగనీవు॥శ్రీశివా॥౩౩॥
కొడుకులకోటవై కూడియుండెదవవ్వ।
చుట్టాలసురభివై పొంపొందునీవు॥శ్రీశివా॥౩౪॥
బంధుగులుగలిగిన భాగ్యవతివేయవ్వ।

అమ్మవారమ్మవా రమ్మవారనుచు। శ్రీశివా॥౮౫॥
జగదమ్మజగదమ్మ జగదమ్మ వినుమమ్మ।
బంగారుకాలికి బాగ। మొక్కెవనె॥ శ్రీశివా॥౮౬॥
అమ్మదోసెడుమాష్టి నంచిచ్చి వేగమే।
బురిగానికిముద్ద బువ్వబెట్టమ్మ॥ శ్రీశివా॥౮౭॥
పోడిగాడిప్పుడు చూడునీపైబత్తి।
గలిగిజంజమ్మని కడువేగవచ్చు॥ శ్రీశివా॥౮౮॥
నీరొమ్ము యిప్పుడు నేతబడనున్నది।
నీకోర్కె గట్టెక్కు నిజముగానమ్మ॥ శ్రీశివా॥౮౯॥
అనవిని పార్వతి యామెరుకులదాని।
నెరుకయడిగెదనని నెనరుగాబలికె॥ శ్రీశివా॥౯౦॥
అవునెమెరుకులదాన యడిగనట్లిచ్చెద।
తార్కాణముగజెప్పు తరుణినాకోర్కె॥ శ్రీ॥౯౧॥
అనగౌరియడిగిన నామాయయెరికిత।
చెప్పెను ఒకమాట నొవ్వగాసపుడు॥ శ్రీశివా॥౯౨॥
ఎరుకజెప్పుటకిప్పు డేమితోచదునాకు।
నాయవస్థనువినుము నాతిరోనీవు॥ శ్రీశివా॥౯౩॥
నాపతినన్నును నాశవతిగణములను।
విడచిదానొకకొండ వెలదుకనుకూడ॥ శ్రీశి॥౯౪॥
వలసితిరుగుచునుండె వానిజాడనునేను।

వచ్చియుంటివిసుమ్మా వనితవినుమమ్మ। శ్రీ॥౯౫॥
సూచాయలేగాని సూటిగాజెప్పంగ।
చాలనునిజమును వీలుగాజెప్ప॥శ్రీశివా॥౯౬॥
మామెరుకలసాని మానుగానిద్దరి।
నున్నదినిజమును నొప్పుగాజెప్పు॥శ్రీశివా॥౯౭॥
అనవిని చెలిబిల్చి యతివేడ్కలొబంచె।
యెరుకలసానికై యతివేగమునను॥శ్రీశివా॥౯౮॥
ఎరికెతదరిజేరి యెలనాగపలికెను।
నెమవోడితెమ్మనె నిమిషమెడలేక॥శ్రీశివా॥౯౯॥
రావమ్మాయోయమ్మ రాజసమేలనె।
యతివేగమునను మాయమ్మసన్నిధికి॥శ్రీశివా॥౧౦౦॥
అనిననెరుకలసాని యతిముదమొదవంగ।
నెరుకో యెరుకో యనుచునింపుతోవచ్చె।శ్రీ॥౧౦౧॥
వచ్చినయెరికతను వరముగాపార్వతి।
జూచియద్భుతమొందెసుదతియందముకు।శ్రీ॥౧౦౨॥
రత్నపీఠమునందు రమణినికూర్చుండ।
నియమించకపటపు నెలతయిట్లనియె॥శ్రీశి॥౧౦౩॥
ఎరుకవారలు గలరెందరైనను మాకు।
సరివత్తురేకలపవానరో వినవే ॥శ్రీశివా॥౧౦౪॥
మమ్మునలోకసామాన్యముగదలచకుము।

కొన్నితారార్కణములు కొమ్మనే చెపుదు॥శ్రీ॥౧౦౫॥
పద్మజురాణికి పరిణయంబౌటమా।
మెరుకనేగాదటె మెంచిచూడగను॥శ్రీశి॥౧౦౬॥
పాకశాసనురాణి పరిణయంబౌటయు।
మామెరుకనె కాదె మహనీయముగను॥శ్రీశి॥౧౦౭॥
గరిమగామూడు లోకముల శుభంబులు।
మామెరుక నేసుమ్ము మానుగానమ్మ॥శ్రీశి॥౧౦౮॥
తరుణిసీమదికోరెక్క తారార్కణముగ జెప్పి।
తనకోరెక్క లందుదునుతప్పకను నేను॥శ్రీశి॥౧౦౯॥
ఆమాటలన్నియు నతివేడ్కతోవిని।
యాగౌరితనమది నలరంగదలచి॥శ్రీశివా॥౧౧౦॥
ఇంగావుచేటలో పలముత్యములబోసి।
మున్నూరుతనహస్తమునబట్టి వేగ॥శ్రీశివా॥౧౧౧॥
ఫాలభాగమునందు పరమభక్తిగనుంచి॥
ప్రమొక్కియిట్లనుచునుమదితమదిదలచె॥శ్రీ॥౧౧౨॥
ముక్కంటి సామికిజక్కగా దయవచ్చి।
నన్నెవుడు పెండ్లాడు దన్నుమీరగను॥శ్రీశి॥౧౧౩॥
అనితలచిముత్యముల నాచేటలోబోసి।
నదినాట్య యందిచ్చి కలువొందగాను॥శ్రీ॥౧౧౪॥
అవుడుతేనగవొప్ప నాతొరుకలసాని।

ఆష్టదైవములకిట్లను చుదలపోసి॥ శ్రీశివా॥ ౧౫॥
సామిసీయప్పతి సక్కరధరుడవో।
దామోదరయ్యయో దైవములరాయ॥ శ్రీశి॥ ౧౬॥
వేదాలుబమ్మకు యిచ్చినవోతండ్రి।
మాధవరాయుడా మమునేలువేల్పా॥ శ్రీశి॥ ౧౭॥
బూదారరూపంబుబొందినయోసామి।
ఆదినారాయణయఖిలాండనాథ॥ శ్రీశివా॥ ౧౮॥
పిమ్మాదిరప్పన్న సింహాద్రినాయకుడ।
నల్లనగుదేవర నాముమ్ములయ్య॥ శ్రీశివా॥ ౧౯॥
తెల్లనితిరుమణి దిదినయోసామి।
నీకు మొక్కెదనిప్పుడు నీలాద్రినాథ॥ శ్రీశివా॥ ౨౦॥
జోకతోనాకన్ని చెప్పదదెలుపుమీ।
బెజవాడలోనున్న పేరయునకురక॥ శ్రీశి॥ ౨౧॥
ఉజనీమహాంకాళి యోయాదినీసతి।
నిత్యశివారాయణీ భద్రకాళి॥ శ్రీశివా॥ ౨౨॥
వికటించకుమినీవు విశదపరచెద నేను।
మాయాపురీశ్వరుని మరిగినదేవి॥ శ్రీశివా॥ ౨౩॥
ఓయాదిలచ్చిమి యోలోకములమాత।
యోడకనాకెపుడు దోడుగావలయు॥ శ్రీశి॥ ౨౪॥
ఓబమ్మయిల్లాల యోసరసపతిదేవి।

హో బారతిదేవి హో పలుకుమాత॥శ్రీశివా॥౧౨౫॥
పరగంగ నాజిహ్మ బాయకనుండుమీ।
యెరుకజెప్పెడివేళ మరువకను నీవు॥ శ్రీశి॥౧౨౬
ఇగనాలుదొలగించు నిగినేశమూరితి।
సగినాలులెస్సగా పాగగా జేయు॥శ్రీశివా॥౧౨౭॥
ఉల్లంబులోనల్పు డెల్లజేజేలార।
కొల్లాపురీ దెపికోరెద నె నిన్ను॥శ్రీశివా॥౧౨౮॥
ఆశించి యీదుండి యాత్మలోదలచిన।
తలపుల్ దేర్చుమె తారాగణముగను॥శ్రీశి॥౧౨౯॥
ఈకాంతవనను నాయెడవచ్చునట్లుగా।
వాకియ్యరేనాదు వదనమునసిలిచి॥శ్రీశివా॥౧౩౦॥
అనిమొంటి వాల్గంటినంటితి ననిమొంచి।
కేలుకేల సమర్చిమెలెరుక చెప్పి॥శ్రీశివా॥౧౩౧॥
ఓయమ్మాయోదెవి యోభాగ్యశాలివె।
భాగ్యములుగలచెయ్యిపతివ్రతచెయ్యి॥శ్రీశి॥౧౩౨॥
సంతానములుగల చల్లనినీచెయ్యి।
కొడుకులకోట్లవై కొమరందవమ్మ॥శ్రీశివా॥౧౩౩॥
ఒకరితలపుజేసి యొకకోర్కికనుకోరి।
దొడ్డ మేలడిగితివి చెడ్డ లేదమ్మ॥శ్రీశివా॥౧౩౪॥
అవికా మొపంపొయని యడుగుచునున్నావు।

కల్లమోసజ మొయని కడుభ్రమసినావు॥శ్రీ॥౧౩౫॥
అవునో కాదోయని యాత్మలోఁ దలచితివి।
చేకూడవో లేక చేకూడుననుచు॥శ్రీశివా॥౧౩౬॥
తడబడుచున్నావు తరుణిరో వినవమ్మ।
కాయగాదదిపండు కాంతవినవమ్మ॥శ్రీశివా॥౧౩౭॥
కల్లగాదది నిజముకలికిరో వినవమ్మ।
శీఘ్రమే చేకూడు సిద్ధమిది నమ్ము॥శ్రీశివా॥౧౩౮॥
పకోపుకార్యమన నీకోపుకార్యమిది।
తలపుతాగ్రాణముగ తప్పకను జెప్పుదు॥శ్రీశి॥౧౩౯॥
స్త్రీపురుషభేదములు సిద్ధముగ జెప్పెదు।
మగవారిపై తలపు మగువరో వినవె॥శ్రీశివా॥౧౪౦॥
ఎదలోఁ దలంచితివి యెన్నాళ్లకైనని।
యొకటిరెండో మూడో యొప్పుగానననె॥శ్రీశి॥౧౪౧॥
పండ్ల తరణిగాదు యెంచనాగవినవమ్మ।
కొద్దిలోపమగాని కొంత తెగుండ॥శ్రీశి॥౧౪౨॥
చేడగాడినటూడి చోద్యంబుగానీవు।
తకోరరబికోరలదసరిఁగలికెదవె॥శ్రీశివా॥౧౪౩॥
అప్పుమనము మెచ్చి యచ్చో రెలిచ్చెదవె।
యిప్పుడునే సాధుశిక్కడనైనాను॥శ్రీశివా॥౧౪౪॥
పాదగట్టియున్నాడు పాలతమగఁడౌదునని।

సీతనుఁగనబడకను నాకుఁగనిపించు।శ్రీశివా॥౧౪౫॥
మేనువణంకెను మెయిచెమటబుట్టెను।
చాలపులకరింపు మేలుగాఁగలిగె॥శ్రీశివా॥౧౪౬॥
నీపైనిదయవచ్చె నెమ్మితోఁబెండ్లాడు।
శీఘ్రముగనీకోర్కె సిద్ధముగునమ్మ॥శ్రీశివా॥౧౪౭॥
నాబుట్టువాఁడని నమ్మించిపలికిన।
నానందమునుజెంది యతివిస్మయమున॥శ్రీ॥౧౪౮॥
ఇదియేమియూవింత యెఱికతలెందైన।
వచ్చిచెప్పరెకొన్ని వరుసశకునములు॥శ్రీశి॥౧౪౯॥
మ్రొక్కినేనడిగిన నిక్కముగనాకోర్కె।
నీమెరుకలసామి యింపుగనుజెప్పె॥శ్రీశివా॥౧౫౦॥
ఉచ్చబాడిచినయట్టు లచ్చముగాజెప్పె।
వెరికతగాదిదియెంది మాడగను॥శ్రీశివా॥౧౫౧॥
నాపాలిశివకృప నాకెమగనీమూర్తి।
యైయవతరించెనని హర్షంబునొంది॥శ్రీ॥౧౫౨॥
ఇచ్చెలిమెచ్చినే నేమిచ్చుదానను।
జగములనిచ్చినను జాలివెలికి॥శ్రీశివా॥౧౫౩॥
ఋసిమల్లెపూదండ దనప్రియుమెడనేయ।
నటులముక్తాహారమతివమెడవైచె॥శ్రీశివా॥౧౫౪॥
మరియునునవరత్న మయభూషణంబులు।

విలువైనచీరెలువిడెమొసంగుచును॥ శ్రీశివా॥ ౧౪౫॥
తగురీతినీజాల తెగదయనుంచుమని।
వినయోక్తులాడిన వెలదికిట్లనియె॥ శ్రీశివా॥ ౧౪౬॥
ఇపుడేమినీతల పేడేరినప్పుడు।
నీభాగ్యమంతయును నిజముగా వాదు॥ శ్రీశి॥ ౧౪౭॥
అనగనాదినిజమని యాపార్వతీదేవి।
వినయమునవెరికితను వీడ్కొల్పెనంత॥ శ్రీశి॥ ౧౪౮॥
పగతిపశుపతి వేగమేపతియగు।
ననుచునాత్మనుదలచియతివచింతించె॥ శ్రీశి॥ ౧౪౯॥
తపముసేయక కాని దగసిద్ధిగాదని।
తల్లిదండ్రులయాజ్ఞదగబొందియపుడు॥ శ్రీ॥ ౧౫౦॥
జడలువల్కలములు సరవితోధరియించి।
గౌరీశిఖరమునకు గౌరిచాజనియె॥ శ్రీశివా॥ ౧౫౧॥
అచ్చటనివసించి యతిఘోరతపమును।
జేయనారంభించె సిద్ధముగనంత॥ శ్రీశివా॥ ౧౫౨॥
నిబిడగర్జనలతో నీరదంబులుగూడి।
తళతళమెరసి జలధారలన్గురియ॥ శ్రీశివా॥ ౧౫౩॥
బట్టబయలునవిల్చి బలునిష్ఠమండగా।
శిరసుపైజలధార లెరవొందగురిసె॥ శ్రీశి॥ ౧౫౪॥
ఇట్లువర్షాకాల మింపులోవెల్లించ।

హిమసాంద్రముగవచ్చె హేమంతఋతువు॥ శ్రీశివా॥
ఇట్టిదుస్సహమైన హేమంతఋతువందు।
జలమధ్యమందుండి సతితపము జేసె॥ శ్రీశి॥ ౧౬౬॥
భీష్మంబుగావచ్చె గ్రీష్మఋతువంతటను।
వెలదియా వేడిమికి వెరపేమి లేక॥ శ్రీశివా॥ ౧౬౭॥
పంచాగ్ని మధ్యమున పరమనిష్ఠనునిల్చి।
తపము జేయుచునుండె తరుణియచ్చోట॥ శ్రీ॥ ౧౬౮
ఆఘోరతపముచే నవనివణంకెను।
సర్వభూతములును చాలభయమొందె॥ శ్రీశి॥ ౧౬౯
అంతటశంకరుండతి మోదమొప్పంగ॥
వటువేషమున వచ్చె వనితసన్నిధికి॥ శ్రీశివా॥ ౧౭౦
తనఫాలభాగమున దగనూర్ధ్వపుండ్రము।
పాలాశదండంబు బరగహస్తమున॥ శ్రీశివా॥ ౧౭౧॥
లలితమధ్యంబున నలరమౌంజినిజుట్టి।
పొలుపొందుపావలను పొందుగామెట్టి॥ శ్రీ॥ ౧౭౨॥
పచ్చకౌపీనంబు బాగుగాధరియించి॥
దరివచ్చుభృంగిని దగుశిష్యుజేసి॥ శ్రీశివా॥ ౧౭౩॥
ఆతనిశిరమందు నజినపుస్తకములు।
చెలువొందగానుంచి చెలిమిమీరగను॥ శ్రీ॥ ౧౭౪॥
పదియునారేడుల ప్రాయపుబాలుడై।

బాలసూర్యునివలెబలుతేజ మొప్ప॥శ్రీశివా॥౧౭౫
వామనమూర్తివలె వచ్చిపావనమైన ।
గౌరీతపోవనముగనెసంతసమున॥శ్రీశివా॥౧౭౬॥
ఫలపుష్పచయముచే విలసిల్లువనమందు।
తనజపాంతమునందు దగజెలులగూడి॥శ్రీ॥౧౭౭॥
మితఫలాహారంబు మేలిమిగాజేసి ।
వేదికపైనయావెలదికూర్చుండె॥శ్రీశివా॥౧౭౮॥
ఆపార్వతినిజూచి యతిమోహమగ్నుడై ।
వటువేషధారియగు వామదేవుండు॥శ్రీ॥౧౭౯॥
సర్వజ్ఞుడయ్యును సామాన్యతనుబూని।
యతివసౌందర్యమునకతిలోలుడగుచు॥శ్రీ॥౧౮౦॥
ఈబాలనేలీలనెనసెదనోయనుచు।
నింతిసమీపమునకెలమితోవచ్చె॥శ్రీశివా॥౧౮౧॥
అప్పుడుచెలికత్తె లతనిగనిగౌరితో ।
ప్రియమలరబల్కెవినయ మొప్పగాను॥శ్రీశి॥౧౮౨॥
నీపాలిశివుడువలె నేపారగావచ్చె ।
దగుబ్రహ్మచారియైతనరినమూర్తి॥శ్రీశివా॥౧౮౩॥
ఇట్టివారలపూజ సింపొందజేసిన ।
నిఖిలశుభంబులునీకబ్బుముగగల్గు॥శ్రీశివా॥౧౮౪॥
అటుగాననీతని కతిభక్తిచేమ్రొక్కి ।

దివసలొందుము తేజరిల్లగను। శ్రీశివా॥ ౧౮౫॥
అనగౌరియాతని కర్ఘ్యపాద్యములిచ్చి।
నతిజేసియు చిత్రాసనముసమర్పించె॥ శ్రీశి॥ ౧౮౬॥
అకపటవటుడుదా నాశీర్వదించెను।
శీఘ్రమేవవివాహసిద్ధిరస్తనుచు॥ శ్రీశివా॥ ౧౮౭॥
అసమయునిట్లనె నాసనాసీనుడై।
యతివనుజూచి యత్యానందముగను॥ శ్రీశి ౧౮౮॥
ఎవ్వరిదానవే యింతినీపేరేమి।
యేలతపమొనరించె దీవనమునందు॥ శ్రీశి॥ ౧౮౯॥
హిమగిరితనయవో యౌవనలక్ష్మివో।
నిజముగాదెలుపుము నీకేజనేత్రి॥ శ్రీశివా॥ ౧౯౦॥
తెలిపిననీకోర్కె ఫలితముగాజేయ।
జాలుదుజవ్వని జాలమికనేల॥ శ్రీశివా॥ ౧౯౧॥
అనినన పార్వతి యతిలజ్జనొందుచు।
తనచెలికలవాణిగనినన దియనియె॥ శ్రీశివా॥ ౧౯౨॥
వినుమయ్యయీకన్య తనయహిమవంతునకు।
పార్వతియనుపేర బరగుచునుండు॥ శ్రీశి॥ ౧౯౩॥
శివునిబెండ్లాడుటకు చిత్తముదృఢపర్చి।
తపముజేయుచున్నాదె తథ్యముగనిచట॥ శ్రీశి॥ ౧౯౪॥
అనినబ్రహ్మచారివెస పకక్క ననునవ్వి।

అనురాగమున నిట్టులనియె నుమత్రోడ॥ శ్రీశి॥ ౯౫॥
ఎక్క సత్యముగాగ నీచెలిపలికెనో।
అక్కటహరుని బెండ్లాడంగవగునె॥ శ్రీశివా॥ ౯౬॥
పరీతిదో చెనీకిబుద్ధి జెప్పవే।
పడతిరో సబుద్ధిబంగారుగాను॥ శ్రీశివా॥ ౯౭॥
కపటబుద్ధినినిన్ను కడుమోసపుచ్చిరి।
యెవ్వరోగాని నే నేమి చెప్పుదును॥ శ్రీశివా॥ ౯౮॥
అయిననాతని చర్యలరసి చెప్పెదగొన్న।
కులగోత్రములు లేవు గుణహీనుడతడు॥ శ్రీశి॥ ౯౯॥
అట్టి వానిని బెండ్లియాడుట కన్నను।
పుస్తెగట్టించుకో పాలతి స్థాణువున శ్రీశి॥ ౧౦౦॥
నగుబాట్లపనియగు నమ్ము నా మాట।
తగమనీవతనివి దగబెండ్లియాడ॥ శ్రీశివా॥ ౧౦౧॥
నేనును నిక్కము నిర్జితేంద్రియుడను।
అయినను నిను బెండ్లియాడ నెప్పెదను॥ శ్రీశి॥ ౧౦౨॥
స్వాధ్యాయమంతయు సాంగముగా నేను।
నధ్యయనము జేసి యలరియుంటినిగ॥ శ్రీశి॥ ౧౦౩॥
బ్రహ్మచారిని లోక పావనుండను బహు।
ధనముగలవాడను తరళాయతాక్షి॥ శ్రీశివా॥ ౧౦౪॥
అష్టవిభూతుల ననుభవింపుచు నీవు।

కొండనెక్కిన విపుడెకొరత లేకుండ॥శ్రీశి॥౧౦౫॥
ఇపుడేమి జెప్పెద నీమేను నీబదే।
తపము చాలించు నాతపుణివగుటకును॥శ్రీశి॥౧౦౬॥
అనవిని పార్వతి యతికోపయుక్తయై।
చెలులతో నిట్లని తెలియగాబలికె॥శ్రీశివా॥౧౦౭॥
బ్రహ్మచారియటంచు భావించి భక్తిచే।
పూజజేసితివీని బుద్ధి తెలియకను॥శ్రీశివా॥౧౦౮॥
శివుశంభునీశ్వరు చిన్నయానంచుని।
నిందజేసెనహాహా నీతిదప్పుచును॥శ్రీశివా॥౧౦౯॥
పరగంగజూచిన పరమశామాంధుండు।
వటుడుగాడీతడు మటుమాయధారి॥శ్రీశి॥౧౧౦॥
బోటులెల్ల నుతగు బుద్ధులు చెప్పుచు।
వీనినిచటినుండి వెడలింపవలయు॥శ్రీశివా॥౧౧౧॥
అనిచెప్పి పార్వతి యతిలజ్జితాస్యయై।
యున్నంత చెలులెల్లనొక్కుమ్మడిగను॥శ్రీ॥౧౧౨॥
కోకలు బిగగట్టి కోపంబులలరంగ।
మాయావటునిగదిసి మానినులువేగ॥శ్రీశి॥౧౧౩॥
వచ్చినవారిగని వటుశివుడొళ్ళంగి।
పలికెను దానవుకుభయము వెట్టిల్లి॥శ్రీశివా॥౧౧౪॥
ఏమిచేయుదునునీ కెవ్వరుదిక్కిక।

కామినీభూతములు కడుబుట్టదోడగ॥ శ్రీశి॥ ౧౫॥
ఎందేనిబోవక నిటకేలవస్తిరి।
యికనుమిమ్మునువిడువ రీమానవతులు॥ శ్రీ॥ ౧౬॥
వచ్చియుబొందగా వసియుంచియుండక।
పోకిళ్లుపోనేల పూనిమీరిచట॥ శ్రీశివా॥ ౧౭॥
సమసగానాకు చనువెవరు చెప్పేరు।
నేనెక్కడికిబోను నెనరుతోనిపుడు॥ శ్రీ॥ ౧౮॥
అటు వగచుచునుండు నాభృంగిగనుగొని।
మునువీబట్టదగు మెరబెట్టకుండ॥ శ్రీశి॥ ౧౯॥
అనియతివలుడాయ నతిభీతినొందుచు।
ఆయవారిపుస్తకము లంటవద్దనుచు॥ శ్రీశి॥ ౨౦॥
పాదభగ్నంబైన పగిదికుంటుచునడుచు।
భృంగినిగనినగియంగనలనిరి॥ శ్రీశివా॥ ౨౧॥
మీయయ్యవారికి మేముపెట్టెడి పాళ్లు।
చూడుమటంచును చేడియలుమరియు॥ శ్రీశి॥ ౨౨॥
వడికొనివచ్చిన వడిమొల్లవెట్టుచు।
ననువములుడీమీరునయముగానిపుడు॥ శ్రీశి॥ ౨౩॥
అయ్యవారలవద్ద నధ్యయనముచేయ।
నయిదచ్చరములైననరయరావాయె॥ శ్రీ॥ ౨౪॥
అయ్యవారినిగూటుటక్కరలేదిక।

ఏమైననా కేమియీయయ్యకిచాట॥శ్రీశివా॥౨౨౫॥
అనిబ్రతిమాలిన యతని నింతులువిడచి ।
బ్రహ్మచారినిగదిసిపనిబూనిరపుడు॥శ్రీశివా॥౨౨౬॥
బాపడుకటిసూత్రమే పాటిగట్టెడిది ।
డెబ్బున మొలత్రాడు దెంచెనొకవనిత॥శ్రీశి॥౨౨౭॥
మా చెలినినునంటె మైలనొందితివని ।
తలమీదఘటము చేదగనీరునుంచె॥శ్రీశివా॥౨౨౮॥
వినదగునట్లుగా నెవ[illegible]ంతు పెండ్లికని ।
సిగబట్టిమున్నుంద జేసెనొకచెలియ॥శ్రీ॥౨౨౯॥
పులిభయంబిచ్చుటను పామ్మని బెదరించి ।
పులితోలుపైవేసె పొలతియొకర్తె॥శ్రీశి॥౨౩౦॥
ఈరీతి నవమాన మింతులు చేసిన ।
సత్యంబులై యొప్పసర్వేశుడపుడు॥శ్రీశివా॥౨౩౧॥
గగనాంబరుండును గంగాధరుండును ।
వ్యోమకేశుండయి యొనరిదామటియు॥శ్రీ॥౨౩౨॥
వ్యాఘ్రచర్మంబును వసనముగాదాల్చి ।
హరుడుప్రత్యక్షమైయమరెనవ్వుచును॥శ్రీ॥౨౩౩॥
ఆరీతిశంకరుండట్టులగనిపించగ ।
నతిసంభ్రమంబుతోనకాంతలలరి॥శ్రీశి॥౨౩౪॥
అతివేగమునబల్కె రాగౌరితోనపుడు ।

వామదేవుండయ్యె వటువేషధారి॥ శ్రీశివా॥ ౨౩౫॥
అనవిని పార్వతి యతిసంభ్రమముతోడ।
భక్తిచే లజ్జచే ప్రేమచే నలరె॥ శ్రీశివా॥ ౨౩౬॥
కలకలనవ్వుచు కలవాణిసఖికనియె।
తగుబుద్ధిజెప్పితి పథపునకిపుడనిన॥ శ్రీశివా॥ ౨౩౭॥
నవమాలికనియెను నగికలవాణితో।
నాశిష్యునకెగ్గేమియతవత్తాజేసె॥ శ్రీశివా॥ ౨౩౮॥
బ్రహ్మచర్యముమాన్పి పరగనీశ్వరునకు।
వరగృహస్థునిజేయు కరమొప్పగాను॥ శ్రీ॥ ౨౩౯॥
అనవిని పార్వతితన చెలులకు మ్రొక్కె।
మేలమాడుటకిది వేళయేయనుచు॥ శ్రీశివా॥ ౨౪౦॥
ఆసమయంబున నచటికి శంభుండు।
వృషభవాహనమెక్కి వేడ్కతో వచ్చి॥ శ్రీ॥ ౨౪౧॥
రమణీమణినిజూచి రమణీయముగబల్కె।
ప్రేమాభిమానముల్ బెనగొనుచు నొప్ప॥ శ్రీ॥ ౨౪౨॥
రావెముద్దులగుమ్మ రమణిరో సిగ్గేల।
ననునేలుమీవేగ నావెతలుదీర్ప॥ శ్రీశివా॥ ౨౪౩॥
తాళజాలనేనేను తరుణిరో మ్రొక్కెదమ।
వేగకౌగిలియిచ్చి వెలయననుబ్రోవు॥ శ్రీశి॥ ౨౪౪॥
అనిపెక్కుభంగులనభవుండు వేడిన।

లజ్జచే జెలినరసిలలితముగ బల్కె ॥శ్రీశివా॥౨౪౫॥
తల్లిదండ్రులచాటు దాననటంచును ।
తెలియనా మారుగా తెలుపంగరాదే శ్రీశి॥౨౪౬॥
నను బెండ్లియాడుటకు నగరాజు చెంతకు ।
తగువారి నంపుటది ధర్మమార్గంబు ॥శ్రీశివా॥౨౪౭॥
అని గౌరి బలుకంగ నదివిని శంభుండు ।
నంతహితుండయ్యె నతివిరహమునను ॥శ్రీ॥౨౪౮॥
చింత చే కైలాస శిఖరికి నే తెంచి ।
వింతవింతలుమదిని చింతింపుచుండె ॥శ్రీశి॥౨౪౯॥
అంతట పార్వతి యతివిరహితాత్మయై ।
తనసకియలనుజూచి తగనిట్టులనియె ॥శ్రీశి॥౨౫౦॥
తెరుణేందుధరునకు దయవచ్చియెన్నడు ।
కోరికలనుదీర్చు కొరతలేకుండ ॥శ్రీశివా॥౨౫౧॥
అనుచువేసటనొందు నప్పార్వతినిజూచి ।
కలవాణి నవమాలి కలుసంభ్రమమున ॥శ్రీశి॥౨౫౨॥
శిశిరోపచారముల సేదదేరిచి వేగ ।
జనిహిమవంతుని గని జెప్పిరంత ॥శ్రీశివా॥౨౫౩॥
ఆహిమవంతుండు నామేనకయువిని ।
సంతసమొందిరి పరవితోనంత ॥శ్రీశివా॥౨౫౪॥
మరియునుదమపుత్రి మంగళోత్సవమును ।

సమహూప్పనీశ్వరుడై సర్వరక్షకుడు॥ శ్రీశి॥ ౨౪౪॥
అనుచు సర్వేశ్వరుని నానందమున వారు।
ధ్యానించుచుండిరి మానసమునందు॥ శ్రీశి॥ ౨౪౫॥
శ్రీశివా శితికంఠ శ్రీపార్వతీశ్వరా॥
శ్రీశుభంబులనొసగి శీఘ్రమున బ్రోవు॥





శ్రీరామ-

శ్రీరస్తు.

శ్రీశుభం భవతు-

అవిఘ్నమస్తు-

శ్రీశివాయగురవేనమః-

# శ్రీగౌరీవివాహః

## తృతీయాశ్వాసప్రారమ్భః-



శ్రీ శివా శితికంఠ శ్రీపార్వతీశ్వరా।
శ్రీశుభంబులనొసగి శీఘ్రమునబ్రోవు॥
ఈశ్వరప్రేరణ నింపులొంబుషులెల్ల।
శివుజూడవచ్చిరి శీఘ్రంబుగను॥ శ్రీశివా॥ ౧॥
ఆసమయమునందు నగజనుదలచుచు।
విరహసంతాపమున వరశంకరుండు॥ శ్రీశివా॥ ౨॥
కైలాసగిరిచంద్ర కాంతశిలామయ।
వేదిపైభృంగితో వేసనువసియించె॥ శ్రీశివా॥ ౩॥
సప్తమహాఋషులు సరసనుచేరి।
శంభునలో భృంగి సరసముగననిమె॥ శ్రీశివా॥ ౪॥
అవచ్చువారెవ్వరతివృద్ధదేహులు।

ఆరసి సెలవియ్యుడి యతిశీఘ్రమునను ॥శ్రీశివా॥౫॥
అనశంకకుండనియె నావచ్చువారలు।
సప్తఋషివర్యులు చనుదెంచిరటకు॥శ్రీశివా॥౬॥
అనునంతలోఋషు లతిమోదమునవచ్చి।
చెలగియథావిధిగ శివునిదర్శించి॥శ్రీశివా॥౭॥
ఉచితపీఠములందు నొప్పుగాగూర్చున్న।
మౌనులకుశలంబు మానుగానడిగి॥శ్రీశివా॥౮॥
ప్రాసంగికంబుగా పార్వతినెంచాడ।
తనతలంపునుదెల్పి తగనిట్టులనియె॥శ్రీశివా॥౯॥
ఈకార్యమునకును నికరముగామీరు।
ఘటకులైసంఘటన గావించవలయు॥శ్రీశివా॥౧౦॥
ఘనులార మునులార కడువేగమేమీరు।
హిమవంతుసన్నిధి కేగంగవలయు॥శ్రీశివా॥౧౧॥
ఫలపుష్పములతోడ బాగుగామీరలు
తగురీతినాతని దర్శింపవలయు॥శ్రీశివా॥౧౨॥
మరివారిపెద్దలను మానితంబుగగూర్చి।
మాట్లాడవలయును మహనీయముగను॥శ్రీ॥౧౩॥
కార్యార్థికిని నేమి గర్వముండమగాన।
నీయరుంధతితోడ నేగంగవలయు॥శ్రీశివా॥౧౪॥
ఆర్యనడుగుటకయి యతివలయొద్దకు।

సతివలనంపుజేయరయనుచితంబు। శ్రీశివా॥౧౫॥
వెండిబంగారములు వేవేలరత్నములు।
కొండలుగామేము కూర్చెదమనుచు। శ్రీశివా॥౧౬॥
లక్ష్మైశ్వర్యములు నాసజేవేయనుచు।
సిద్ధులు మీరంపెదరు నాడంగవలయు॥ శ్రీశివా॥౧౭॥
మీవంటివారే మెలతకూర్పికయున్న।
మీకేలాఘనమగు మేలుగావినుడి॥ శ్రీశివా॥౧౮॥
తల్లిదండ్రులు లేరు దగుబంధువులు లేరు।
సర్వనిర్వాహకులు సత్యముగమీరె॥ శ్రీశివా॥౧౯॥
కావునమీరలుకడుసంతసముగ నుండు।
హిమవంతుననుమతి నింపుగావెంచి। శ్రీశివా॥౨౦॥
లగ్నకార్యమును లలితముగాజేసి।
పాలన్నమునడని పరగరావలయు॥ శ్రీశివా॥౨౧॥
అనవినియామును లానందభరితులై।
యాజ్ఞనుగైకొని యరిగిరాగిరికి॥ శ్రీశివా॥౨౨॥
అంతనాహిమవంతు డధికహర్షంబుతో।
మునులనెమరొగ నివినగలోనరించి। శ్రీశివా॥౨౩॥
నవరత్నసింహాసనములుసమర్పించి।
వారలుప్రియముగావసియించిరంత॥ శ్రీశివా॥౨౪॥
ఆనగనేరయు నతివినయంబుతో।

నమితసత్కారము లమరంగఁ జేసి॥ శ్రీశివా॥ ౨౫॥
మా భాగ్యవశమున మాగృహంబునకును।
మీరు వేంచేసితిరి మేము ధన్యులము॥ శ్రీశివా॥ ౨౬॥
మీరాక చేమాకు మేలైనశుభములు।
గలుగుట కేమైనఁ గలదె సంశయము॥ శ్రీశివా॥ ౨౭॥
అన మునీశ్వరులు నారాసనగాధీశుతో।
మీరన్న మాటల మిథ్యయగు నిలను॥ శ్రీశివా॥ ౨౮॥
మేము శుభకార్య మేనిశ్చయించుకొని।
వచ్చితిమిప్పుడు వరవాక్యమునను॥ శ్రీశివా॥ ౨౯॥
కార్యసంఘటనము గావించవలె మీరు।
మా మాటమన్నించి మహనీయముగను॥ శ్రీశి॥ ౩౦॥
శ్రీసదాశివునకు శ్రీసర్వమంగళను।
శ్రీకరంబుగనిచ్చి శ్రీనిధివిగమ్ము॥ శ్రీశివా॥ ౩౧॥
నీపుత్రికకుఁదగు నెమ్మిమీరఁగశివుఁడె।
శివునకు నీపుత్రి చెలువొందఁదగును॥ శ్రీశివా॥ ౩౨॥
భాగ్యభోగ్యములచే బ్రిబలిదంపతులయి।
మొదటఁగఁ బ్రేమచే నెలమిమిం డెదరు॥ శ్రీశి॥ ౩౩॥
సంశయంబుందక గర్వజ్ఞమూర్తి।
కన్యాకమర్పణగావించవలయు॥ శ్రీశివా॥ ౩౪॥
అనిన సంతసమొంది యానగరాజు నై।

మీయాజ్ఞ మన్నింతు మేలిమిగనిపుడు॥ శ్రీశివా॥ ౩౫॥
ఇందు శేఖరునకు   నింపుతోఁ జెప్పుద।
నామూహ్యపట్టిని   నయముమీరగను॥ శ్రీశివా॥ ౩౬॥
తగినట్టుస్థలమెంచి   తగిలియవలెనని।
పెద్దలవాడిక   పేర్మిఁ జేగలదు। శ్రీశివా॥ ౩౭॥
ఇంతకన్నను సుభ మేమియు లేదని॥
సంతసముగబల్కె   నంతలే వనుచు॥ శ్రీశివా॥ ౩౮॥
అంతఃపురంబునకా యరుంధతిచని।
మేనకచేత సమ్మానమును బడసి॥ శ్రీశివా॥ ౩౯॥
అనియె మేనకతోడ   నతికౌతుకంబొప్ప।
అహాహా నీభాగ్యమే మని జెప్పవచ్చు॥ శ్రీశివా॥ ౪౦॥
హానుడునీయల్లుడ   నయ్యెపనను చును।
కోనుచుని పుడుగాడె   కొన్నావినుమమ్మ॥ శ్రీశివా॥ ౪౧॥
ఆయింక ధరునను నీయిందుముఖికిఁ।
దగవివాహముచేయదగునెంచి చూడ॥ శ్రీశివా॥ ౪౨॥
ఈనంపతుల పెండ్లి   యెల్లలోకములకు।
వానందకరమగుచు   వలరి శోభిల్లు॥ శ్రీశివా॥ ౪౩॥
అననరుంధతితోడ   ననియెన మ్మేనక।
యతివినయంబున   నతిహావమునను॥ శ్రీశి॥ ౪౪॥
సర్వసుఖంబులు   సర్వసంపదలును।

మీదీవనలగా దెమేలుగా గలుగు॥శ్రీశివా॥౨౫॥
పరమపతివ్రతావరశిఖామణులైన।
మితలం పెన్నడు మిథ్యగాదిరయు॥శ్రీశివా॥౨౬॥
ఆసమయంబున నమ్మేనకాత్మజయు।
నటవిలాసముమీర నచటికే తెంచి॥శ్రీశివా॥౨౭॥
నతనొనరించిన నతనిమోదమువొప్పంగ।
నాయకుం గతిసతికి నాశీర్వదించె॥శ్రీశివా॥౨౮॥
అంకముపైనని నగారావంబున।
సుందిమేలంబొప్పుమజాది యనియె॥శ్రీశి॥౨౯॥
నాముద్దుతల్లినిను నయముతోనడిగెద।
నిప్పుడేనన్నొకమాట నింపుగాజెపుము॥శ్రీశివా॥౩౦॥
నీనాథుతో గూడి నీవ్రెందుసమయమున।
నరుదువచ్చినవాని నరసిరానీయవో॥శ్రీశివా॥౩౧॥
అనవిని లజ్జచే నాననంబునువంచి।
మేతలుపక్కులకు మేపింతుననుచు॥శ్రీశివా॥౩౨॥
అనిదిస్సననను జనునాబాలచేపట్టి।
రావమ్మపిగేల రమణిగోనీకు॥శ్రీశివా॥౩౩॥
కొంగిసాక మూరు కరమొప్పనాకిచ్చి।
జనుమనరాకున్న జననితాజూచి॥శ్రీశివా॥౩౪॥
కనుబొమనదలించి తనయుతోనిట్లనె

పెద్దలాజ్ఞనునీవు పేర్మిజేసెదము॥ శ్రీశివా॥౫౫॥
వచ్చికౌగిలియిచ్చి వరభక్తినుండుమీ।
యనునంతహిమవంతుడచటికేతెంచి॥ శ్రీశి॥౫౬॥
మంతనంబునదన మానినితో జెప్పె।
కళ్యాణవార్తను గడుమోదమునను॥ శ్రీశివా॥౫౭॥
వినిసంతసంబొందియనియె హిమవంతుతో।
పరమేశుతోమనము సరితూగుటెటుల॥ శ్రీశి॥౫౮॥
కళ్యాణమేరీతి గావించువారము।
హరునికళ్యాణంబు హరియెచా జేయు॥ శ్రీశి॥౫౯॥
భక్తవాత్సల్యమున పద్మాక్షుడరుదెంచి।
యీమహోత్సవమును నింపలరజేయు॥ శ్రీ॥౬౦॥
అనినిశ్చితాత్ములైయామునులతోననిరి।
యిచ్చటనెయాపెండ్లి యింపుగానగును॥ శ్రీశి॥౬౧॥
పెండ్లికొడుకునుమీరు ప్రియముగావేగము।
తరలించుకొనిరండు తగువేడ్కమీర॥ శ్రీశి॥౬౨॥
అనివీడుకొల్పిన నామునులరుదెంచి।
హర్షమునశుభవార్తహరునితోజెప్ప॥ శ్రీశి॥౬౩॥
అతిముదమొందుచు నభవుండుకైలాస।
పట్టణాలంకృతిని బాగుగనుజేసి॥ శ్రీశివా॥౬౪॥
బ్రహ్మాదులనుబిల్వ బంపించియనియెను।

శ్రీహరినేపగిది శిష్యులుగ బిల్వ॥ శ్రీశివా॥౬౫॥
సనకాదులకుగాని శక్యమేయటకేగ।
ననవారలే తెంచి హరువాజ్ఞ జెందు॥ శ్రీశివా॥౬౬॥
స్వర్లోకమహాదిగాసప్తలోకములను।
దాటివైకుంఠమును దగగనతేక॥ శ్రీశివా॥౬౭॥
శ్రీహరిపదములు చిత్తములందిడి।
భక్తిచేబహుభంగి స్తుతులు చేయ॥ శ్రీశివా॥౬౮॥
శ్రీహరికృపచేత శ్రీకరంబైనట్టి।
వైకుంఠపురమును వారుగనిరంత॥ శ్రీశివా॥౬౯॥
భాగవతోత్తముల బాగుగాదర్శించి।
నతులొనరింపుచు నయముతోనపుడు॥ శ్రీశి॥౭౦॥
అతిశోభతోనున్న యారత్నసోపాన।
మార్గమునను జన మరియును ఛ్చటను॥ శ్రీశివా॥౭౧॥
అతివిశాలంబైన యత్యున్నతంబైన।
స్థలమెకటగానచట లలితమైయున్న॥ శ్రీశివా॥౭౨॥
సింహాసనమునందు శ్రీవిష్ణుదేవుండు।
తనపత్నులనుగూడి తనరియుండగను॥ శ్రీశివా॥౭౩॥
వారలు శ్రీహరిని వరభక్తిదర్శించి।
సాష్టాంగదండములు సరగుననుజేసి॥ శ్రీశి॥౭౪॥
కరములుజోడించి కడువేడ్కనుతిజేయ।

నశ్వాదరంబున నచ్యుతుడు పలికె॥ శ్రీశివా॥ ౨౫॥
మునులార మీవచ్చు పని మే మెరుంగుదుము।
పార్వతిని బెండ్లాడ పరమేశ్వరుండు॥ శ్రీశి॥ ౨౬॥
తగనూహ జేసి మిము దానంపెము బిల్వ।
పార్వతి పెండ్లికి బరగ వచ్చెదము॥ శ్రీశివా॥ ౨౭॥
గౌరియందును మాకు కడు దయగావున।
హిమవంతు పక్షమున నే నెంతు వినుడి॥ శ్రీశివా॥ ౨౮॥
ఏపక్షమైనను నేమి యొక్కటిగాదె।
మీరు బ్రహ్మాదులును మేలు గాజనుడి॥ శ్రీశివా॥ ౨౯॥
కైలాసగిరి కేగి కడు వేడ్క నుండుడని।
కమలపత్రాక్షుండు కరుణతో బల్కె॥ శ్రీశి॥ ౩౦॥
అనవిని యామౌనులానందమగ్నులై।
శ్రీనాథునకు మ్రొక్కి సెలవు గైకొనుచు॥ శ్రీశి॥ ౩౧॥
కైలాసనగరికి కడు వేగమున జని।
శివుని సందర్శించి చెప్పిరంతయును॥ శ్రీశివా॥ ౩౨॥
అంత శ్రీశంకరుం డతితోషయుక్తుడై।
బ్రహ్మేంద్రమునులను బహుసత్కరించి॥ శ్రీశి॥ ౩౩॥
సంతుష్టులం జేసి సరవితో నప్పుడు।
తనకు నెచ్చెలి యైనధనదునీక్షించి॥ శ్రీశివా॥ ౩౪॥
తన యభీష్టసిద్ధి దగనాయెననుచును।

నలరుచుముచ్చటలాడుచునపుడు॥ శ్రీశివా॥౮౫॥
సూటిగానొకమంచి సుముహూర్త దినమున।
భేరికాదిధ్వనులు భూరిమోయంగ॥ శ్రీశివా॥౮౬॥
వీణాదరవములు వేవేలు చెలంగంగ।
రంభాదినాట్యములరపమించి వెలయ॥ శ్రీశి॥౮౭॥
వందిమాగధులుకైవారంబులును సేయ।
వరవస్తాదులు నరయదీపించ॥ శ్రీశి వా॥౮౮॥
పరిణయోత్సవమునకు పరమేశ్వరుండును।
హిమనగంబునకేగు సమయంబునపుడు॥ శ్రీ॥౮౯॥
మెరుగులతలకన్న మేలైనపటుజటా।
పటలంబుబల్ జరీపాగనైయలరె॥ శ్రీశివా॥౯౦॥
చెలువైనకళలచే నెలకొన్న నెలమాన।
వజ్రపుసరిపేషు వగనుదగియుండె॥ శ్రీశివా॥౯౧॥
భాసిల్లుసిగతీసు వాసిగానున్నట్టి।
మిన్నేరు పూదండ మేలిమిగదనరె॥ శ్రీశివా॥౯౨॥
మిసిమిచేమెయినొప్పు భసితంబులేబూత।
రంగైనసన్నంపు టంగిమైమెరసె॥ శ్రీశివా॥౯౩॥
భూషణములైయున్న భోగిఫణిరబులు।
తాళీలైమెమింబతళుకొత్తియుండె॥ శ్రీశివా॥౯౪॥
పులితోలుపైవన్నె బలుశాలువైయుండె।

వనల నేత్రముఖుంక మలరుచుక్క వ్యె॥ శ్రీశి॥ ౯౫॥
ఈరీతిగాను శివు డింపొంది పెండ్లికి।
వృషతురంగము నెక్కి వెడలెదానపుడు॥ శ్రీ॥ ౯౬॥
హరుశువచ్చెడి వార్త యాహిమవంతుండు।
విని మేరుమందరులకు సయె నిట్లనుచు॥ శ్రీశివా॥ ౯౭
తామత సాక్షుండు దగరాకయున్నను।
పరిణయమోదంబుపరగనెట్లవునో॥ శ్రీశివా॥ ౯౮
అని భావమునదల్చ నావిష్ణుదేవుడు।
కరుణారసంబొప్పనరుగు సమయమున॥ శ్రీ॥ ౯౯॥
శ్రీభూమినీళలు దిబువొంద వెంటను।
వచ్చెదమనుచును నుచ్చరించగను॥ శ్రీశివా॥ ౧౦౦॥
రావలదనుచును రాజీవనేత్రుండు।
రమణులతోబలెక రహియించగాను॥ శ్రీశి॥ ౧౦౧॥
అనినవవ్వనితలు నామ్లానవదనలై।
యతిచింతనొందుచునపుడిష్టులనిరి॥ శ్రీశివా॥ ౧౦౨॥
మిమ్మెడబాయుచు మేమెంటివారానెపుడు।
మమువిడనాడుటయు మాధవాతగునా॥ శ్రీ॥ ౧౦౩॥
అనవినియచ్యుతం డతిమోదమొందుచు।
నతివలననలరించి యలుకదీర్చెపుడు॥ శ్రీశివా॥ ౧౦౪॥
శ్రీలక్ష్మివక్షమున చెలువుగామెరయంగ।

నుభయపార్శ్వములందనురుతరంబుగను ॥౧౦౫॥
శ్రీభామినీళులు చెలిమిమీఱుచునుండ।
గరుడునిపైనెక్కి యరిగెహిమగిరికి॥ శ్రీశి ॥౧౦౬॥
అప్పుడుహిమవంతు డతిభక్తియుక్తుడై।
సాష్టాంగముగమ్రొక్కి సవినయంబుగను ॥ శ్రీ ॥౧౦౭॥
కరములుజోడించి కడువేడ్కతోననియె।
నేనెంతవాడను నినుబూజసేయ ॥ శ్రీశివా ॥౧౦౮॥
అనుచుయథావిధి నచ్యుతుబూజించి।
నవరత్నసింహాసనముసమర్పించె ॥ శ్రీశివా ॥౧౦౯॥
అందునధిష్ఠించి యాహరియుండంగ।
దానునుదనభార్య తగుపూజచేసి ॥ శ్రీశివా ॥౧౧౦॥
తనయచేమ్రొక్కించి వినయంబుగాననియె।
నీబిడ్డగాజూడు నిఖిలేశయనిన ॥ శ్రీశివా ॥౧౧౧॥
బాలనుదీవించి చాలసంతోషమున।
ననియెనప్పుడుహరియగరాజుతోడ ॥ శ్రీశి ॥౧౧౨॥
గంగవాపిని గౌరిగారాపుబిడ్డయె।
అయినసోదరివలె నమరంగజూతు ॥ శ్రీశివా ॥౧౧౩॥
అనియానతిచ్చుచు నానందమొందించి।
యందరినిజయచేత నలరివిత్తించె ॥ శ్రీశివా ॥౧౧౪॥
అంతనప్పుడుజనులద్భుతమొందుచు।

నలినాక్షుసేవించినయ మొప్పవసరి॥ శ్రీశివా॥ ౧౧౫॥
హిమవంతుభాగ్యంబు నేమనవచ్చును।
బ్రహ్మాదులకు గాన బడనిహరివచ్చె॥ శ్రీశి॥ ౧౧౬॥
ఈవారిరాకచే నింపుమీరగ గౌరి।
కళ్యాణమిలలోన ఘనతజెన్నొందు॥ శ్రీశి॥ ౧౧౭॥
అనను తియింపుచు నాజనులందరు।
కనులకు కువుదీర కమలాక్షుగనిరి శ్రీశివా॥ ౧౧౮॥
శ్రీశునితనుకాంతి చెన్నొందిహిమగిరి।
యింద్రనీలచ్ఛాయ సాంద్రమైదనరె॥ శ్రీశి॥ ౧౧౯॥
అంతహిమవంతుండు నతిసంతసంబున।
పన్నీరుధారలను బరగజల్లించె॥ శ్రీశివా॥ ౧౨౦॥
ముత్యాలముగ్గులను ముద్దుగాబెట్టించె।
మణిదీపజాలములు మరియునుంపించె॥ శ్రీశి॥ ౧౨౧॥
కళ్యాణకేతువులు ఘనముగాస్థాపించి॥
వివిధచిత్రములను వెలయవ్రాయించి॥ శ్రీశి॥ ౧౨౨॥
ఈకీర్తిసౌధముల నెలమిశృంగారించి।
మంగళోత్సవమును మదిగోరియుండె॥ శ్రీ॥ ౧౨౩॥
అంతటశంకరుండతి వైభవముతోడ।
హిమగిరిదరికిని నేతెంచియచట॥ శ్రీశివా॥ ౧౨౪॥
ఉద్యానవనమందు మనుత్సాహముగనుండి।

భూసురలనివ్వరను బొంకుగాబంప॥శ్రీశి॥౧౨౫॥
వారుసంతోషమునవచ్చియానగరాజ।
మీయుపవనమంను మేలుగానిపుడు॥శ్రీశి॥౧౨౬॥
పెండ్లికొడుకును గూడి పెండ్లివారలువచ్చి।
దిగిమమ్ముబనిచిరితేజరిల్లగను। శ్రీశివా॥౧౨౭॥
అనిశుభవార్తనునాయిద్దరును జెప్ప।
నానగపతివారి నత్సత్కరించి॥శ్రీశివా॥౨౨౮॥
మేరుమందరవింధ్య చారుమలయప్రముఖ।
బంధుమిత్రులతోడ బంధురుండగుచు॥శ్రీశి॥౧౨౯॥
ముందుగావిష్ణుని మోదమునగనుంచి।
జయశబ్దములు జయజయయనంగ॥శ్రీశి॥౧౩౦॥
వేత్రములంబూని వెలయునైనాకుండు।
కోలాహలుండును గూడివేడుకతో॥శ్రీశి॥౧౩౧॥
ఉభయపార్శ్వంబులనుండిబరాబరుల్।
సేయగానియమించెశ్రీకరంబుగను॥శ్రీశివా॥౧౩౨
సుందరములైనట్టి యందలంబులతోను।
శ్రీభూమినీశలును జెలువొప్పగాను॥శ్రీశివా॥౧౩౩
మేనకమొదలైన మెలతలనందరను।
వచ్చునట్లానరించెవరతోషమునను॥శ్రీశి॥౧౩౪॥
రథగజాశ్వపదాతి రాజితచతురంగ।

బలములుసలుగడల భాసిల్లుచుండ॥శ్రీశివా॥౧౩౫॥
వారాంగనలనృత్యవైభవంబలరంగ।
భేరికాహళములు భోరుకొనిమ్రోయ॥శ్రీశి॥౧౩౬॥
వీణాదివాద్యములు వీనులపింపగా।
గంధర్వగానముల్ ఘనముగామెరయ॥శ్రీశి॥౧౩౭॥
భూసురులదీవనల్ భూరిసంఖ్యగనొప్ప।
వందిమాగధులకైవారముల్ చెలగ॥శ్రీశివా॥౧౩౮॥
ఈరీతిహిమవంతుడీశుని పడిదికి।
వచ్చినత్యుత్సవవైభవంబలర॥శ్రీశివా॥౧౩౯॥
అంతసాయంసమయిమప్రటనునగసేత।
చంద్రదీపంబులును సాంద్రమైదనర॥శ్రీశి॥౧౪౦॥
కప్పురపుబిఏటీలు కడుతేజమలరగ।
మహతాబువెలుగులుమరియులాయీలు॥శ్రీ॥౧౪౧
వెన్నెలకాంతివలె వెలకెక్కయుండంగ।
నక్షత్రతారలునునాగతారాలు।శ్రీశివా॥౧౪౨॥
కొమ్ములువేమారు కోట్లుదిచ్చుబుడు।
మహనీయమైనట్టిమరియగాధిలు॥శ్రీశివా॥౧౪౩॥
చాంపేయబాణముల్ చామంతిబాణముల్।
వెన్నముద్దలుమరియువింతబాణములు॥శ్రీశి॥౧౪౪
అంతరిక్షంబున నధికప్రకాశమున।

నలగుచు వెలుగొంకు నాసమయమందు ॥శ్రీశి॥౧౪౫॥
రంభాదినాట్యముల్ రమణీయమై వెలయ।
నుభయపక్షమువారు నొప్పుగానపుడు ॥శ్రీశి॥౧౪౬॥
అభివందనాదిక నాదిసత్కారములు।
ననోన్యన్యమొనరించియతిమోదములర ॥శ్రీశి॥౧౪౭॥
పన్నీరు మొదలైనపరిమళద్రవ్యముల్।
జల్లులాడుచుమనసులుల్లాసమునను ॥శ్రీశి॥౧౪౮॥
కప్పురపువిడియముల్ కస్తూరిదామముల్।
చందనపత్రపు సమితిజెన్నొంద ॥శ్రీశివా॥౧౪౯॥
దివ్యాంబరంబులు దేజరిల్లగనంత।
సర్వవైభవములు సరపజెన్నొంద ॥శ్రీశివా॥౧౫౦॥
పెండ్లికొడుకునుముం. పేర్మిగొసిడుకొని।
శ్రీవిష్ణునాజ్ఞచే జెలువుమీరగను ॥శ్రీశివా॥౧౫౧॥
విడిదిలోపలనుంచి కడుమోదమొప్పగ।
వెడలెనత్యుత్సవవిభవములరంగ ॥శ్రీశివా॥౧౫౨॥
అంతటమాధవుండలజయంతవసంత।
నలకూబరాదులను నానాముగమరియు ॥శ్రీశి॥౧౫౩॥
ఇంద్రచంద్రాదుల నింపొందుమైనాక।
కోలాహలాదులను కొమరొప్పగాను ॥శ్రీశి॥౧౫౪॥
అంతగంధర్వుల నంతరాంతరముల।

సమరియుండగ జేసియు శుభంబలర ॥శ్రీశివా॥౧౫౫॥
స్వర్గవేశ్యల నృత్య సౌరభ్యముల జూడ ।
నియమనంబొనరించిన యా మెప్పుగాను ॥శ్రీశి॥౧౫౬॥
అఖిలజనావళి యానందభరితులై ।
యిత్యద్భుతమునొందిరా యుత్సవమున ॥శ్రీ॥౧౫౭॥
పరమేష్ఠి హేమాద్రి వరవసిష్ఠమునీంద్ర ।
సనకసనందన సన్మౌనిముఖ్య ॥శ్రీశివా॥౧౫౮॥
ఋషులతో నల్లన వృషభధ్వజునితోడ ।
నగరాజపురమందు దగ బ్రవేశించె ॥శ్రీశివా॥౧౫౯॥
పురసుందరీజనులు పొల్పొంద మౌక్తిక ।
కుసుమాక్షతములను కొమరొప్ప జల్లి ॥శ్రీశివా॥౧౬౦
మంగళహారతులు మానినులు బట్టంగ ।
పెండ్లికుమారుని ప్రియముతో నపుడు ॥శ్రీశి॥౧౬౧॥
దక్షిణపాదంబు దగనుంచునట్లుగా ।
ముందుగా దాటించి మోదమలరంగ ॥శ్రీశివా॥౧౬౨
అంతఃపురంబున కతిసంతసము మీర ।
నగ్రిప్రవేశించి రతివినోదమున ॥శ్రీశివా॥౧౬౩॥
మరకతతోరణ మహనీయమై యొప్పి ।
ముత్యములజాలర్లు ముద్దులొలుకంగ ॥శ్రీశి॥౧౬౪॥
స్వర్ణవితానము ల్చక్కనై యొప్పార ।

పెండ్లిముస్త్రీలతోను బేర్మిగానున్న॥ శ్రీ॥శి॥౧౬౫॥
మంగళదేవిక మంజులముగానున్న।
సుందరకళ్యాణమందిరమునందు॥ శ్రీశివా॥౧౬౬॥
చిత్రాంబులైనట్టి చిత్రకంబళములు।
చెన్నొందునచ్చోట శ్రీమారుతు॥ శ్రీశి॥౧౬౭॥
సింహాసనమునందు జెలువొప్ప గూర్చుండి।
తగుజనంబుల నెల్లదగు బోటనుంచి॥ శ్రీశివా॥౧౬౮॥
వాచరంగీలమునయుమంగళధ్వనుల।
నానంద మొందించె నఖిలలోకులను॥ శ్రీ॥౧౬౯॥
ఆసమయంబున నతిసుందరాంగియగు।
నమరాంగనయొకర్తె యతివేడుకలర॥ శ్రీశి॥౧౭౦॥
పెండ్లికుమారునకు ప్రేమితోదలయంటె।
కరకంకణంబులు ఘల్లుమనిమ్రోయ॥ శ్రీశి॥౧౭౧॥
కొందరమరాంగనలు కూర్మి శ్రీశివునకు।
గంధామలకముంచి కడువేడుకలర॥ శ్రీశివా॥౧౭౨॥
మంగళస్నానముస్సాంగుమును జేయించి।
శ్రీపీతాంబరములను జెలువొప్పనిచ్చి॥ శ్రీ॥౧౭౩॥
దివ్యభూషణముల దేజరిల్లగజేసి।
శోభనతిలకమును సొంపుగానుంచి॥ శ్రీశివా॥౧౭౪॥
కజ్జలంబును గనుల కమనీయముగదీర్చి।

శ్రీకరంబుగ జెలులు శ్రీగౌరి జేరి॥ శ్రీశివా. ౧౭౫॥
సంపెగతైలమున సఖియొక తెతలయంటె।
జలజలోచనయొకతె జలకమాడించె॥ శ్రీశి॥ ౧౭౬॥
తడియొత్తెనొకతె పుత్తడిబొమ్మకంపుచే।
చీనాంబరమునిచ్చె చెలియయొక్కర్తె॥ శ్రీ॥ ౧౭౭॥
మణిభూషలుదగిల్చె మానినీమణియొకతె।
సుందరతిలకమిడె సుదతియొక్కర్తె॥ శ్రీశి॥ ౧౭౮॥
పూవులుముడిచెను పూబోణికినొకర్తె।
శివుచెంతజేర్చెను శ్రీగౌరినొకతె॥ శ్రీశివా॥ ౧౭౯॥
దేవదుందుభులపుడు దివ్యముగమ్రోగె।
అప్సరస్త్రీలాడి రతిరమ్యముగను॥ శ్రీశివా॥ ౧౮౦॥
గంధర్వకిన్నరులు ఘనముగబాడిరి।
కుసుమవృష్టిని సురలుకురిపించిరపుడు॥ శ్రీశి॥ ౧౮౧
సర్వజనంబులు సంతోషభరితులై।
యద్భుతమగ్నులై యపుడుండిరంత ॥ శ్రీశి॥ ౧౮౨
అచ్యుతునాజ్ఞచే నజుడుపురోహితుం।
డగుచుబ్రహ్మాసనమందుగూర్చుండె॥ శ్రీశివా॥ ౧౮౩॥
సర్వదేవతలును సనకాదియోగులు।
సప్తర్షిముఖ్యులు సకలమునివరులు॥ శ్రీశివా॥ ౧౮౪॥
వరగనరుంధతీ ప్రముఖపతివ్రతలు।

కనులపండుగగాఁగ గనుగొనుచునుండ॥శ్రీశి॥౧౮౫
అంకురార్పణ విధినలరుచు గావించి।
ఫలదానములు బ్రహ్మాదుల కిప్పించి॥శ్రీశి॥౧౮౬॥
వేదోక్తమార్గంబు విధియొప్పుచుండఁగ।
తెరవైచె నవ్వధూవరుల మధ్యమున॥శ్రీశివా॥౧౮౭
లగ్నాష్టకంబులు లలితముగ భూసురులు।
చదివిరిట్లనుచును సరవితోనపుడు॥శ్రీశివా॥౧౮౮
వధూవరాభ్యాం వరదా భవంతను చ।
కుర్వంతు మంగళం సర్వదాయనుచు॥శ్రీ,శి॥౧౮౯
పరియుంచు చుండంగ పరమ సంతోషమున।
తెరదించె మైత్రీవరకౌతుకమున॥శ్రీశి॥౧౯౦॥
ఆసమయంబున సభవునకంబికను।
తెరయెత్తె సంతోషశరధి పెంపొంద॥శ్రీశి॥౧౯౧
మంగళధ్వనులెల్ల మహనీయముగ మ్రోయ॥
హిమవంతుడపుడు దనయింతియును దాను శ్రీ॥౧౯౨
గౌరిచేలక్ష్మికి గడుపూజ చేయించి।
సంతుష్టులగుచును సలలితంబుగను॥శ్రీశి॥౧౯౩॥
తగులజ్జచేతను దలవంచుకొనియున్న।
తనయను దమముందు దగనుఁ జూకొనుచు॥శ్రీ॥౧౯౪॥
పసిడిపళ్ళెమునందు పసుపరిపదములు।

కడిగిదంపతులపుడు కడు మోద మొప్ప॥ శ్రీ॥ ౧౯౫॥
సాలంకృతంబుగా సకలవిభవంబుగా।
కన్యకనునర్పించె కర మొప్పగాను॥ శ్రీశివా॥ ౧౯౬॥
పరమసంతోషమున పాణిగ్రహణంబు।
శ్రీశివుడు చేసెను జాలువొప్ప గాను॥ శ్రీశి॥ ౧౯౭॥
అంతగుడజీరకము నంపికశిరమునపై।
మంచిసప్తపదంబు లెంచిపొ్రక్షించె॥ శ్రీ॥ ౧౯౮॥
బాలేందుధరమూర్తి పార్వతికంఠమున।
మంగళసూత్రమును మహితముగగట్టె॥ శ్రీ॥ ౧౯౯
ముత్యములతలంబ్రాలు ముదిత యీశునిపైని।
యీశుండుముదితపైనింపుమీరగను॥ శ్రీశివా॥ ౨౦౦॥
ఒకరిపయినొకరును నొప్పుగాబోయుచు।
నున్నంతనానంద మొందిరందరును॥ శ్రీశివా॥ ౨౦౧॥
అపుడు పేరంటాండ్రు హర్షముల్పొంగ।
బెమ్మెరనటుబాడిరి పెండ్లిపాటలను॥ శ్రీశివా॥ ౨౦౨

ఆనందభైరవి. ఏకతాళము.

శ్రీలక్ష్మీదేవినిశ్రీహరినీబోలి। యీదంపతులు యెపుడు నింపొందవలయు। పుష్పమునుసౌరభము బొందినయటులు। యివ్వధూవరు లెపుడు నెనయంగవలయు॥ చిన్నిమాగౌరమ్మ చెన్నైనచూపు। వ

కపద్మమాలలై వరలుహారునకును। చెన్నారుపు
ష్పములచే రెత్తినట్లు। కన్నెగూపార్వతి కావుర
ము వెలయు॥ కొడుకులకోటవయి కొమరొందవల
యు। కడువేడుకలతోను కడుపుచల్లగను ॥౨౦౩॥

రేవగుప్తి - ఆదితాళము.

శోభనమేయీశునకు। శోభనమేగౌరికిని। శోభన
మేరజతాద్రి శుభనిలయశంభునకు। శోభనమే॥ ర
త్నాలహారతులు। రమణులుమీరియమ్మ। శర్వున
కు శాంకరికి। సర్వశుభంబులునొప్ప॥ శోభనమే॥
కర్పూరహారతులు। కడు వేడుకలలర। కాంతలుమీ
రియరమ్మ। కాంచనపాత్రిలనునిడి॥ శోభన॥ ౨౦౪

మంగళగౌరీరాగము ఏకతాళము.

మంగళముశంభునకు। మంగళము పార్వతికి॥ మంగ
ళముజగదేక। మాన్యులకును। మంగళమునృపరా
జ। మానితతురంగునకు। మంగళముమాసర్వ। మం
గళను ॥జయమంగళం నిత్య శుభమంగళమ్॥
గౌరీవిలసితకేళి। కలితదృక్పాళి। విహారకరమాళి।
నీకునివ్వాళి॥ నివ్వాళిదిగోగైకొమ్మ। నీకిచ్చెదము
గారమ్మ। శ్రీశివునిముద్దులగుమ్మ। చిన్నిబంగారు
బొమ్మ॥ నివ్వాళి॥ శ్రీవిష్ణువక్షమున। జెలువొందు

శ్రీదేవి! భావజుని తల్లి సు! ద్భావవల్లీ! శ్రీయునై
దువతనము! సేమమాయావ్యమును! తనగౌరిదే
వి! ని దయచేసెను ॥ జయమంగళం ॥ ౨౦౫ ॥

అంతటనా భృంగి యంగనవైఖరిని!
కొప్పును సవరించి గొబ్బున నువచ్చి ॥ శ్రీశివా ॥ ౨౦౬
పార్వతిదగ్గరకేగి ప్రణతులనివ్వించి!
యనియెనిట్లను చువా యంబికను జూచి ॥ శ్రీశి ॥ ౨౦౭ ॥
ఇంతదలచిన దాన వేలమా బెదరింపు!
మాటలకు జంకెద వుమానినిరోసీవు ॥ శ్రీశివా ॥ ౨౦౮
కుంపేళ్లబెదరునే పాండుగా తాటాకు!
చప్పుళ్లకెందైన జగతిలో పలను ॥ శ్రీశివా ॥ ౨౦౯ ॥
మీరిద్దరొకటైన మేలుగానాపైని!
దయదప్పవద్దనితగగౌరియుంటె ॥ శ్రీశివా ॥ ౨౧౦ ॥
అటులనాపైదయ నరయనుంచదో లేక!
చీకాకుచేస్తి నని కాకజెందెదవో ॥ శ్రీశివా ॥ ౨౧౧ ॥
అటులైన జెవుమునే నెటకైననేగెద!
ననగౌరిదలవంచియతిలజ్జనుండె ॥ శ్రీశివా ॥ ౨౧౨ ॥
అంతటకలవాణి యాభృంగితోననియె!
లజ్జచేనిటులుండెలలితాంగియిపుడు ॥ శ్రీశివా ॥ ౨౧౩ ॥
కళ్యాణకాలంబు గానకోపమువలదు!

నిలునిలుమనేఖ్యాంగియలరుచునుబ్బి॥ శ్రీశివా॥ ౨౧౪
నాపని బాగాయె నయముగాననుచును।
వేశ్యాజనంబులను వెక్కిరింపుమను॥ శ్రీశివా॥ ౨౧౫
పరపరివిధములప్రజలనవ్వింపుచు।
వికృతపుచేష్టలు వెస జేయుచుండె॥ శ్రీశివా॥ ౨౧౬॥
అంతనాహోమమంతు నఖిలసురభూసురుల।
నతివేడ్క నలరించి యతివినయమొప్ప॥ శ్రీశి॥ ౨౧౭॥
చందనతాంబూల సకలపరిమళవస్తు।
సంభారసమితి చే సంతుష్టిపరచె॥ శ్రీశివా॥ ౨౧౮॥
వామదేవుడుతన వామభాగమునందు।
వామలోచనయుండ వరనియమమొప్ప॥ శ్రీ॥ ౨౧౯
విధ్యుక్తముగ హోమ విధిని గావింపుచు।
దంపతులతిశోభదనరారిరప్పుడు॥ శ్రీశివా॥ ౨౨౦॥
పరమేష్ఠి చేయించె వరలాజహోమంబు।
మైనాకుడింపొందమహనీయముగను॥ శ్రీశి॥ ౨౨౧
అంత స్థాలీపాక మతిశుభంబుగజేసి।
కులదేవతనునిల్పి కూర్మితోనప్పుడు॥ శ్రీశి॥ ౨౨౨॥
ఆపైనరుంధతి నతివేడ్క జూపించె।
హిమవంతుడంతటహితముదీపింప॥ శ్రీశివా॥ ౨౨౩।
బ్రహ్మాదిసురలకు బ్రాహ్మణశ్రేణికి।

నఖిలజనాళికి నతిశయంబుగను ॥శ్రీశివా॥ ౨౨౪॥
కిస్మాని సేతులు కాలువలై పార।
చాయపప్పులు మంచిశాల్యన్నములును॥శ్రీశి॥ ౨౨౫॥
కాయకూరలు చాల్లుకలగాయిపులుసులు।
నూరగాయలు రుచులూరు పచ్చడులు॥ శ్రీశివా॥ ౨౨౬
బూరెలు కకరాల్ పూతట్లులాడూలు।
బరిఫీజిలాబీలు పరగనరిశలును ॥శ్రీశివా॥ ౨౨౭॥
పెన్నప్పములు మరియువివిధ భక్ష్యంబులు।
పాయసములు పంస్లుపానకంబులును ॥శ్రీశి॥ ౨౨౮॥
వరుగులప్పడములు వడియమ్ముల్మ్మనాల్।
మీగడ పెరుగుపాల్ మిసిమిజున్నులును॥ శ్రీశి॥ ౨౨౯
అపరంజిపళ్లెములందు వడ్డింపించ।
నందరును భుజియించి గానందమొందె॥శ్రీశి॥ ౨౩౦॥
ఆపయినగనేత యతివినోదముతోడ।
తాంబూల మత్తరు పుదగ చందనంబు ॥శ్రీశి॥ ౨౩౧
కర్పూరహారముల్ ఘనత సమర్పించ।
సంతసమొందుచు నరసముగ వారు॥ శ్రీశి ॥ ౨౩౨॥
సౌధాంతరములందు సరవితోనుండిరి।
మహాదుత్సవంబున మహనీయముగను॥శ్రీశి ॥ ౨౩౩॥
కాంతలంతటిలోన కడుమంగళంబొప్ప।

కంగదెచ్చిరత్న కాంతపాత్రములు॥ శ్రీశి॥ ౨౩౪
బాగ్రికెన్నజేసిరి బలువైభవముమీర।
నాశీర్వదించిరయ్యజుడుభూసురులు॥ శ్రీశివా॥ ౨౩౫
దొంగవేలిమిచేత దొంగిలిశర్వుండు।
లలనామణిసరస లలితహృదయంబు॥ శ్రీశి॥ ౨౩౬॥
ముల్లోకములవారు మోదసంభరితులై।
భోజనాదియథేష్ట భోగములనలరి॥ శ్రీశివా॥ ౨౩౭॥
బహుమానములుచెంది భాసిల్లుచుండిరి।
సకలసుఖస్థితి సంపూర్ణులగుచు॥ శ్రీశివా॥ ౨౩౮॥
అంతనమరాంగనలాదంపతులకపుడు।
జాఫరానలుగులు జానుగానుంచి॥ శ్రీశివా॥ ౨౩౯॥
మగువపేర్మగనిని మగనిపేర్మగువను।
దగజెప్పడమటను దలుపులనువేసి॥ శ్రీశివా॥ ౨౪౦॥
పరిహాసవాక్యముల పాటలపాడుచు।
మహోత్సాహమునమండి రొప్పమీరుచును॥ శ్రీశి॥ ౨౪౧
అయిదవదినమందు నలశేషహోమంబు।
సలిపినాకబలికి సమకట్టిరంత॥ శ్రీశివా॥ ౨౪౨॥
అప్పుడుకొందరు కప్పురగంధులు।
మార్మినిటుబాడిరి కౌతుకములపాట॥ శ్రీశివా॥ ౨౪౩॥

తోడిరాగము ఆదితాళము.

ఇంతిరావె చామంతి। బంతిరావె రత్నాల। దొంతిరావె మన్మథుని। దంతిరావె॥౧॥ కన్నెరావె చిన్నిపొన్న। గున్నరావె యన్నుల। మిన్నరావె కప్పురంపు దిన్నెరావె॥ ౨॥ కలికిరావె మరునిపూ। ములికిరావె విలుగల। కొలికిరావె వజ్రాలపలకరావె॥ ౩॥ కస్తూవిల్తుతేజిరావె। కొమ్మరావె ముద్దుల। గుమ్మరావె కనకంపు। బొమ్మరావె॥ ౪॥ బోణిరావె సైకత। శ్రోణిరావె యంబుజ। పాణిరావె యళికుల వేణిరావె॥౫॥ సఖియరావె చెలియరావె। చానరావె చేడెరావె। కొమ్మరావె కొణ్ణములను। గోరిదంతము॥౬॥ గరుడవాహనములమంచి। గౌరికుంకుమములరత్న। సాలుపచ్చగన్నెరులు। సన్నదినసులు। కలయగానుకూర్చిహస్త। కంకణధ్వనులు మెరయ। నందెచప్పుళ్లు ఘల్లుమనగదం చిరి॥సువ్వి సువ్వి సువ్వి సువ్వి సువ్విసువ్విసువ్విసువ్వి। సువ్వియాని బాడిరీ సుదతులందరు॥౨౪౪॥

అంగనలందరు నతివిచిత్రతరముగ।
ముత్యాలముగ్గులనుమోదమునసుంచు।శ్రీ॥౨౪౫॥
నాగప్పసానియైన యరుంధతీదేవి।

తద్విధులెల్లను దనరీతి జేసె॥ శ్రీశివా॥ ౧౪౬॥
సతిపతులచ్చోట సంతోషమునసుండ।
హరియిచ్చె కానుకలైశ్వర్యములను॥ శ్రీ॥ ౧౪౭॥
మామయల్లునికిచ్చె మాణిక్యకిరీటాదిక।
బహుమూల్యవస్త్రముల్ బరిఢవిల్లగను॥ శ్రీశి॥ ౧౪౮॥
బ్రహ్మేంద్రముఖ్యులు బహురీతి కట్నముల్।
చదివించియొసగిరి కలభాగ్యములు॥ శ్రీశి॥ ౧౪౯॥
ఊరాడ నీరాడు గొబ్బున దోణకింద।
యత్రివేట్కబాన్సికి రాసతిపతులు॥ శ్రీ॥ ౧౫౦॥
యువతులయ్యులలోన నొకబొమ్మనుంచుచు।
సలపసంగముజిక్కయత్నమునను॥ శ్రీశి॥ ౧౫౧॥
జోజోయటంచును జోలలుబాడిరి।
చోద్యమునందరికి హృద్యంబుగాను॥ శ్రీ॥ ౧౫౨॥
మిథునతాంబూలము శైలతపాదంపతుల।
కిచ్చిరంతవసంత మెలమిచేబూని॥ శ్రీశివా॥ ౧౫౩॥
ఒకరిపైనొకరను నొగిజల్లులాడుచు।
నంటిరిసంభ్రమం బొప్పుచును మెరయ॥ శ్రీ॥ ౧౫౪॥
శ్రీవిష్ణుదేవుండు శ్రీశంకరునిమీద।
మరదిహాస్యము చేసె వరకౌతుకమున॥ శ్రీశివా॥ ౧౫౫॥
కనకనాగములను కరములచేబూని।

కుంకుమోదకమును కూర్మిఁ జేజల్లె॥ శ్రీశివా॥ ౨౫౬॥
శ్రీపతివక్షమున జెలువొందుక సుభ।
కనకాంబరప్రభ గాంచియీశ్వరుడు॥ శ్రీశి॥ ౨౫౭॥
కుంకుమోదకమని పంకముగనూహించి।
భ్రమచేతనుండెను పరమహర్షమున॥ శ్రీ॥ ౨౫౮॥
శ్రీభూమినీళలు చెలగి పార్వతిపైని।
చెలరేగి జల్లిరి యులవసంతమును॥ శ్రీశివా॥ ౨౫౯॥
పంకజాక్షుడు నిన పత్నులదరికేగి।
మూడుహస్తములచే ముఖ్వరను బట్టి॥ శ్రీశి॥ ౨౬౦
సోదరియగునుమ కుసూటిగానందిచ్చె।
వాలవచేతిచే నలవసంతమును॥ శ్రీశివా॥ ౨౬౧॥
అందిచ్చువారిపై నాగారిచేతనె।
చింపెవసంతమును నిండువాసమున॥ శ్రీశివా॥ ౨౬౨॥
శ్రీశారదాదేవి చెలగి మేనకతోడ।
సరసమాడుచునతిసంతసము జెందె॥ శ్రీశివా॥ ౨౬౩
నలువయు జెలిమిచే నగరాజుతోగూడ।
సయ్యాటలను జెలగె సరసంబులలర॥ శ్రీశివా॥ ౨౬౪
సర్వలోకజనులు సంతోషమొందుచు।
నప్సరసలతో గూడియతికౌతుకముల॥ శ్రీశివా॥ ౨౬౫
ఓలలాడిరిమిగుల నుత్సాహములుమీర।

జల్లులాడివసంత జలధినీమడుగును ॥ శ్రీశివా॥ ౨౬౬॥
అంతనాహిమవంతు డానందభరితుడై।
భూరిసంభావనలు భూసురులకిచ్చి॥ శ్రీశివా॥ ౨౬౭॥
విద్వాంసులకుమరియు వివిధవిశేషజ్ఞు।
కవినటగాయకనివహంబునకును ॥ శ్రీశివా॥ ౨౬౮॥
అమితసత్కారము లమరంగఁజేసి।
వందిమాగధులకు యివ్వారముల్వెలఁగ। శ్రీశివా॥ ౨౬౯॥
అప్పుడాహిమవంతు డంబికనుశంభునకు।
నప్పగించుటకుఁదా నొప్పుగాఁదలఁచి॥ శ్రీశివా॥ ౨౭౦॥
విడిదికిదోడ్కొని విభవమింపొందంగ।
శివుచేతిలోఁగౌరి జెయ్యుంచిపలికె॥ శ్రీశివా॥ ౨౭౧॥
పరమేశవినుమిపుడు ప్రార్థనేనీవునా।
యల్లుడవౌటచే నయితిధన్యుఁడను॥ శ్రీశివా॥ ౨౭౨॥
పూర్వము చేసిన పుణ్యముల్ఫలియించె।
సకలభాగ్యంబులు సమకూరెఁగొంటి॥ శ్రీశివా॥ ౨౭౩॥
పనులేమియెఱుఁగదు పసిబిడ్డయీబాల।
బుద్ధులన్నియు నేర్పిదిద్దుకోవలెను ॥ శ్రీశివా॥ ౨౭౪॥
సర్వజ్ఞులగుమీకు సరణిదెలియనిదేమి।
పుత్రికాప్రేమచే బూనిబల్కితిని ॥ శ్రీశివా॥ ౨౭౫॥
సర్వభారంబును సకలబాధ్యతయును।

సర్వేశ్వరా నీదె సమకట్టి చూడ॥ శ్రీశివా॥ ౨౬॥
అనుచు పుత్రిని జూచి యతి హర్షితో ననియె।
నా పుత్రిశిఖామణీ నాముద్దుపట్టి॥ శ్రీశివా॥ ౨౭॥
పతియున్న గురుడున్న పరదైవమున్నను।
సపథంబున సగను నాసచావెపుడె॥ శ్రీశివా॥ ౨౮॥
అతిభక్తి పతిమాట కడుగువాఁటకుమన్న।
ఉత్తముల్లైన తండ్రిపలుకు సెప్పుడు॥ శ్రీశివా॥ ౨౯॥
అనుచు నుబోధించి యచ్యుతునీక్షించి।
కన్నీరు గుసించుచు గద్గదికననియె॥ శ్రీశివా॥ ౩౦॥
నారాయణస్వామి నయముతో నీయమను।
నీపుత్రిగా చూచి నెనరుంచి మరియు॥ శ్రీశివా॥ ౩౧॥
కాపాడవలెనని కలకలలాడిన।
జనులకు బాష్పములు జలజలనురాలె॥ శ్రీశి॥ ౩౨॥
అంతహిమవంతున కనియె శ్రీవిష్ణుడు।
చింతనీకేటికి సంతసము వేళ॥ శ్రీశివా॥ ౩౩॥
ఈవధూవరు లెపుడేకశరీరులయి।
యెడబాయకుండుదు రెలమిమీరగను॥ శ్రీశి॥ ౩౪॥
అనవినిహిమవంతు డతిసముచితంబుగా।
దూకునకలు నకు హర్షితో నపుడు॥ శ్రీశివా॥ ౩౫॥
రత్నజవాహీరీ రహిమీరుచున్నట్టి।

కనకాంబరములును ఘనతజెన్నొంద॥శ్రీశి॥ ౩౮౬॥
రథగజాశ్వపదాతి రాజితబలములు।
దాసదాసీజనములుదగియుండగాను॥శ్రీశివా॥ ౩౮౭॥
ఆరణంబుగానిచ్చి యతికుతూహలముతో।
నథ పుని పార్వతిని నంపకము చేసె॥శ్రీశివా॥ ౩౮౮॥
ఆనతిదూరంబేగి యాహిమవంతుండు।
మరలియింటికివచ్చిమహనీయముగను శ్రీ॥ ౩౮౯
బ్రహ్మాదిసురలకు బంధులకుమిత్రులకు।
కట్నంబులర్పించి కడుసత్కరించె॥ శ్రీశివా॥ ౩౯౦॥
తానునుదనపత్ని తగురీతిశ్రీభూమి।
నీళాసమేతుడగు నీరజదళాక్షు॥ శ్రీశివా॥ ౩౯౧॥
పదములుభక్తిచే బాగుగాపూజించి।
వైకుంఠమునకనిపె వరభక్తియలర॥శ్రీశివా॥ ౩౯౨
బ్రహ్మాదులందరు పరమసంతుష్టులయి।
ఆశిషంబులుచేసి యతివేడ్కజనిరి॥శ్రీశివా॥ ౩౯౩
బ్రహ్మాదిసురలును పరమఋషివర్యులును।
వెంటనేతేరంగ విభవమలరంగ॥శ్రీశివా॥ ౩౯౪
అలఘులవర్షము లమరులుగురియింప।
నప్సరసస్త్రీలంత నతివేడ్కనాడ॥శ్రీశివా॥ ౩౯౫
దేవదుందుభులును తేజరిల్లగమోయ।

మంగళవాద్యముల్ మహిమరెట్టిల్ల॥ శ్రీశి॥ ౨౯౬
ప్రమథగణాదులు పార్శ్వములందుండ।
పరమభక్తినిబరా బరులుసేయంగ॥ శ్రీశివా॥ ౨౯౭
ముత్తైదువలందరుసుమ ముక్తాక్షతలుజల్ల।
నెలతలందరుగూడి నివాళులొసగ॥ శ్రీశివా॥ ౨౯౮
మంగళాశీర్వాద మహిమజెన్నొందంగ।
పెండ్లిపాటలశోభ బెంపొందివెలయ॥ శ్రీశి॥ ౨౯౯
శ్రీకరములయిమిగుల చెలువొప్పుచున్నట్టి।
కల్యాణకేతువుల్ ఘనతమీరగను॥ శ్రీశివా॥ ౩౦౦
శ్రీపార్వతినిగూడి శ్రీశంభుడరుదెంచె।
కైలాసగిరికిని కడుసంతసమున॥ శ్రీశివా। ౩౦౧
అంతశివాశివు లంతఃపురంబునకు।
జనిప్రవేసించిశుభ సదనంబునందు॥ శ్రీశివా॥ ౩౦౨
బ్రిహ్మాదిసురలకు బహువిధముల చేత।
సత్కారములుచేసి సరవినంపించి॥ శ్రీశివా॥ ౩౦౩
సుముహూర్తమునవారు శోభనమింపొంది।
యలరుచునుండిరి సలలితంబుగను॥ శ్రీశివా॥ ౩౦౪॥
ఇతరేతర ప్రేమలతిశయిల్లుచునుండ।
సకలసౌఖ్యంబుల నలరిరెల్లపుడు॥ శ్రీశివా॥ ౩౦౫॥
యిటులుండ నొక్కనాడీ శుండుమదిలోన।

పార్వతిభావంబు పరికింప దలచి॥శ్రీశివా॥౩౦౬॥
తనమాలిని బిలచిన దగియున్నంతను।
తరుణిగా జేసి మంతనమున నుండె।శ్రీశివా॥౩౦౭
ఆర్య చెలియొక్క తెయాపింత గనుగొని।
యతికోపమున వచ్చి యింటికవు దెల్పె॥శ్రీశి॥౩౦౮
అతికోపమలరంగ నప్పార్వతీ దేవి।
చిగవిరబూయుచు చెలితోడ ననియె।శ్రీశివా॥౩౦౯॥
పయింతలో గూడె నెలనాగనాపతి।
సందియంబుంచక సఖి దెల్పగదవె॥శ్రీశివా॥౩౧౦
అనవిని చెలిబలెగ నదెవచ్చె భృంగియు।
నాతఁడడిగిన నంతయును దెలుపు శ్రీశివా॥౩౧౧॥
అని చెప్పగా భృంగి నంబికయు డుగంగ।
కలహముబాపెంచ దలచియిట్లనియె॥శ్రీశి॥౩౧౨।
పటిహాపంబున బోటిశిరమందు।
సూటిగానుంచెను చాటుజేయుచును।శ్రీశివా॥౩౧౩
తల్లివద్దను చూలు దాచంగవలదని।
నిజముజెప్పితినమ్మ నెనరుంతువనుచు॥శ్రీశి॥౩౧౪।
ఈమర్మమంతయు మీమదినుంచవలె।
బయలుబడినను మాట బాములొగివచ్చు॥శ్రీశి॥౩౧౫
అనవిని పార్వతి యతివేగమున లేచి।

యలక చేగృహమునకునతి వేగజనియె ॥శ్రీశి॥ ౩౧౬॥
అచటును నేలపై నసుకుసురనుచును।
బొరలుచుబడియుండిపొలుపుదప్పచును॥శ్రీశి॥ ౩౧౭
కన్నులనీర్నింపి కలవాణినింగాంచి।
యింతరో వినుమమ్మ యీవింతవార్త।శ్రీశి॥ ౩౧౮॥
కలనైననెరుగము గదవెయిట్లవ్వనః।
గంగను గూడెనట గరళకంఠుండు ॥శ్రీశివా॥ ౩౧౯॥
చిన్ననాటినుంచి శివుడేధవుడటంచు।
నధికతపోనిష్ఠ నతనిజేకొంటి॥ శ్రీశివా॥ ౩౨౦
అహహా పూర్వపుణ్యమర యనిట్లు ఫలించె।
నేనిసేయుమ ఎభుడింతపనికొప్పె॥శ్రీశివా॥ ౩౨౧
అతివరో నామాట కడుగుదాటనివాడు।
గయ్యాళిగంగను గలసిరాడాయె ॥శ్రీశివా॥ ౩౨౨॥
కులగోత్రజనాన్నేను కూలనానన్విడచి।
వెలతనొకతెను దనతలమీదనుంచె ॥శ్రీశివా॥ ౩౨౩॥
ప్రాణేశుదయలేని పరమభాగ్యంబేల।
చక్కదనమదియేల జవ్వనంబేల ॥శ్రీశివా॥ ౩౨౪॥
అనుచుజింతా క్రాంతమైనగౌరినిజూచి।
కన్నీరునించుచు గలవాణియనియె॥శ్రీశివా॥ ౩౨౫॥
దంతిగమన్నరో యింతచింతనీకేటికి।

నేనునీదాననై నేనరుగానుండ॥శ్రీశివా॥ ౩౨౬॥
నీపతినిను జేరి నెమ్మిచేసెప్పుడు।
బ్రతిమాలినటు జేతు నతిశయంబుగను॥శ్రీశి॥ ౩౨౭॥
నారీమణులకెల్ల నాథులగూర్పంగ।
జెలికత్తెతే గారె చెలిమిమీరగను॥శ్రీశివా॥ ౩౨౮॥
సెలవొసంగుము వేగ శివుదోడిదెచ్చెద।
ననిజనిశంకరు గని మ్రొక్కనతఁడు ॥శ్రీశివా॥ ౩౨౯॥
మంతనంబునదన కాంతవార్తలడుగ।
వింతగానగుచు నాయింతి యిట్లనియె॥శ్రీశివా॥ ౩౩౦॥
అంబిక చెలికత్తెనై చెలంగుచునుండి।
యంతరంగపుమాట లన్నమా తెలుప ॥శ్రీశి॥ ౩౩౧॥
అనవినిశంకరుండనియె గలవాణితో।
గంగవృత్తాంతమునా గౌరివిన్నదియో॥శ్రీశి॥ ౩౩౨॥
అనియడుగ నాయింతి యనియెశంకరునితో।
దాపేలజెప్పెద దగవినుము దేవ॥శ్రీశివా॥ ౩౩౩॥
సర్వము దెలిసెనీ సతికి మహాదేవ।
యతితెంపుచేసుండె నార్యవిరసముగ॥శ్రీ॥ ౩౩౪॥
కావునగౌరికి గనబడకుండగ।
వచ్చితివిటకను వరవేగగతిని॥శ్రీశివా॥ ౩౩౫॥
కలవాణినైనను దెలుపదామెనాకింత।

యనిననునిందింతువనుచు జెప్పితివి॥ శ్రీశివా॥ ౩౩౬॥
అనవిని యాహారుం డాత్మతల్లడమొంది।
చిత్తమురుఘుల్లన చెలికిన్నట్లనియె ॥ శ్రీశివా॥ ౩౩౭॥
దాక్షాయణిని నేను దగవెరుంగుదునని।
కోమలివద్దికిగొబ్బునను జనియె ॥ శ్రీశివా॥ ౩౩౮॥
వినయమునవచ్చిన విభుజూచి పార్వతి।
శిహాలుముసుంగిడి శయసించియుండ॥ శ్రీశి॥ ౩౩౯॥
ఈశ్వరుండుదరిజేరి యింతితోనపుడనియె।
కొమ్మరో నాపైని కోపమెటుగలిగె॥ శ్రీశివా॥ ౩౪౦॥
పలుకవేటికినిన్ను బలుమారు బ్రార్థింప।
కఠినత్వమేరీతిగలిగెనాపైని ॥ శ్రీశివా॥ ౩౪౧॥
చలముచాలించుమని పలికినపతివైపు।
చురచురంజూచుచు సుదతియిట్లనెను॥ శ్రీశి॥ ౩౪౨॥
చాలుచాలొప్పిమ్మిటమేలమాడుటదేల।
యెన్ని నేర్చితివహాహా యింతలోపలనె॥ శ్రీ॥ ౩౪౩॥
ఈవగలీమాయ లీతక్కులెల్లను।
కుటిలాత్మనావద్ద కొరగావుసుమ్ము ॥ శ్రీశివా॥ ౩౪౪॥
పై నమృతంబును బరగలోనవిషంబు।
గలనీమమాటలు గడునమ్మదగునె॥ శ్రీశివా॥ ౩౪౫॥
నీస్వభావంబెల్ల నిక్కంబుగాదెలిపె।

నీప్రియను గూడుము నిశ్చితంబుగను॥ శ్రీశివా॥ ౩౮౬॥
కైలాససుందర కందరస్థలులందు।
విహరింపుమింపొంది విలసితంబుగను॥ శ్రీశి॥ ౩౮౭॥
అనుచు కలస్వనమలర నశ్రులునించ।
హరుడు కౌగిట జేర్చి యత్రివ నలరించి॥ శ్రీశివా॥ ౩౮౮॥
కన్నీరు మడుచుచు గడు లాలనము జేసి।
యతురంగశోధ మింతికెడబాపి॥ శ్రీశివా॥ ౩౮౯॥
నీకు వశ్యుడనౌదు నిరతంబు ననుచును।
నపిలాసముగనుండె శివతో శివుండు॥ శ్రీశివా॥ ౩౯౦
అంతట నాగంగ యచటికి నేతేర।
నంబికగనియానె నధికకోపమున॥ శ్రీశివా॥ ౩౯౧॥
ఎందుండి వచ్చితి విందుధరు చెంతకు।
ఎంతయో యుంటివి నీ కెంత సాహసమె॥ శ్రీశి॥ ౩౯౨॥
ఎంత నిబలికెద యింతిరో వినుమమ్మ।
చెంత నేనుంటినా శాంభుదయజెంది॥ శ్రీశి॥ ౩౯౩॥
అనిగంగబలుకంగ హరుడిద్దరింజూచి।
యనునయమొప్పంగ నపుడిట్టులనియె॥ శ్రీశి॥ ౩౯౪
సాధారణులవలె సహ్యమించుక లేక।
జగడంబులాడుట సతులకనుదగునె॥ శ్రీశివా॥ ౩౯౫॥
అనినగౌరీగంగలలుకలుడిగినాడి।

యనోన్యమైత్రి చేనలరారుచుండి ॥శ్రీశి॥ ౩౫౬॥
బాలెంమధరగూడిబహుసౌఖ్యసంపత్తి।
ననుభవింపుచునుండిరతిహర్షమునను ॥శ్రీశి॥ ౩౫౭॥
ఇటులుండగాపుత్రుడీశ్వరునకుగల్గె।
నింద్రాదిదేవత లింపొందయలరి ॥శ్రీశివా॥ ౩౫౮
పరమేష్ఠిబలికినపలుకునిజంబాయె।
ననిశంభుసన్నిధికరిగియిట్లనిరి ॥శ్రీశివా॥ ౩౫౯॥
శంభో మహాదేవశంకరజగదీశ।
మముబ్రోవుదయతోనుమహనీయమూర్తి ॥శ్రీ॥ ౩౬౦
తారకాసురుడనుదైతేయుబాధచే।
నతికష్టములుబొందియరుగుదెంచితిమి ॥శ్రీ॥ ౩౬౧
వానినివధియింపవశముగాకున్నది।
సేనకుసేనానిశేనిహేతువున ॥శ్రీశి॥ ౩౬౨॥
కావునమీసుతుకడువేగముననిచ్చి।
వానివధింపింపవలయునోదేవ ॥శ్రీశివా॥ ౩౬౩॥
అనవినిశంకరుండాకుమారస్వామి।
నతితోషమునదిచ్చియంపెనందరిని। శ్రీశి॥ ౩౬౪॥
అంతనాసేనానియాదైత్యువధియించె।
సకలభువనంబులుసంతసముజెందె ॥శ్రీశి॥ ౩౬౫॥
సరవితోనీకథ జదివినవిన్నను।

సర్వేశ్వరుండొసగు సర్వసంపదలు ॥శ్రీ॥ ౩౬౬॥
వంశాభివృద్ధిగా వర్ధిల్లుచుందురు।
ధరణిలోనా చంద్రతారార్కమునను॥శ్రీశి॥ ౩౬౭॥
విద్వాంసులకునతి వినయమెలర్పగ।
విశదీకరించెదవిన్నపంబొకటి ॥శ్రీశివా॥ ౩౬౮॥
భక్తినే జేసినభవునిపరిణయకథ।
దప్పులొప్పులు సేయక ప్రస్తుతింతు ॥శ్రీశి॥ ౩౬౯॥

ఆనందభైరవి-ఆదితాళము.

జయపార్వతీశ్వరులకు। జయమంగళం ॥అనుపల్లవి॥ సుకవిలోకస్తుత్యులకు। శుభమంగళం॥ నిగమాంతసంవేద్యులకు। నిరుపమచారిత్రులకు। నిఖిలదేవసేవ్యులకు। నిత్యమంగళం॥జయ॥ భక్తరక్షాదీక్షులకు। భవబంధవిమోక్షులకు। పరమపావనాధ్యక్షులకు। భవ్యమంగళం॥జయ॥ సామగానలోలులకు। సోమరేఖాధారులకు। సకలశుభదాయకులకు। సర్వమంగళం॥జయ॥ మృత్యుంజయనిశ్శంకభూప। మృదుతరహృద్వాసులకు। సత్యశ్రీస్వరూపులకు। సదామంగళం॥ జయపార్వతీశ్వరులకు జయమంగళమ్॥ ౩౭౦॥

గద్యము.

ఇది శ్రీమన్నిశ్శంకవంశపయః పారావారరాకా
సుధాకరులును శ్రీమద్వేంకటనిశ్శంకపౌత్రులును,
శ్రీపెద్దన్ననిశ్శంకపుత్రులును, శ్రీసన్యాసమాం
బాగర్భసంజాతులును, సంగమవలసరాజధాన్య
ధినాథులునైనశ్రీమన్మృత్యుంజయ నిశ్శంక
భూపాలునిచే శ్రీమదుమా మహేశ్వర
ప్రీతిగ శ్రీవిశ్వేశ్వరాంకితంబుగర
చియింపంబడినగౌరీవివాహామం
దలి సర్వముం దృతీయా
శ్వాసము.

శ్రీరస్తు. స్వస్త్యస్తు.